శ్రీహయగ్రీవాయ నమః

# భారవి

## అవతారిక

—— ౦ ——

శా॥ శ్రీమాంగల్యకళావిశేషమున ధాత్రిన్ సుస్థిరస్థాయి, ని
స్సీమప్రౌఢము నా కథాకలన వాసింగాంచి శ్రీభారతీ
యామోఘప్రభ లోకరంగముల నృత్యంబాడఁ దద్వ్యాప్తి ని
త్యామోదంబున మించు దివ్యతరవిద్యాభారవిన్ గొల్చెదన్

మ॥ హరియై శంకరుఁడై విరించియయి శ్రీయై గౌరియై వాణియై
సురసిద్ధాదిసమస్తలోకపతియై శోభాంచితస్థానమై
పరమాత్ముండయి సర్వవిఘ్నహరుఁడై భాసిల్లుదైవంబు త
ద్గురుభావంబుల నీకృతిం గరుణఁజెందుం గాత మాతారమున్.

ఉ॥ భాష లసంఖ్యముల్ రుచిరపద్ధతులన్ గృతు లందొనర్చి పే
ల్వాభవలుగాఁగ మానికటభూమి సమర్పణచేసి చన్నవా
గ్వైభవులు కీర్తిగేహములఁ గృత్యములోజ్వలదర్పణంబులన్
బోవకులాచు మాకృతులప్రోదికి మూలములౌట యబ్రమే !

మ॥ మహనీయాద్భుతవైఖరిన్ గవులయంశల్ ప్రస్ఫురద్భావలన్
బహుళార్థస్ఫురణంబుగా వెలసి, కావ్యశ్రీలఁ బోషించి, మా
కిహమం దంతములేని సద్గురుత నిక్షేపించి, దైనందిన
స్పృహణీయోదయశస్తతన్ బొలుచు పెంపే గాదె కృత్యంగమా.

సీ॥ అష్టావధానమష్క్రియాపాటవంబున నొకవేళ నొకమూల నొనరువారు
నద్వితీయబలాధికావేశమున మించి యొకబాట నొకచోట నొప్పువారు
నోడిపోవనిరణవ్యూహసంధానత నొకవైపు నొకతేప నుబుకువారు
దిటుగాననిపాండితీధురంధరతచే నొకసారి యొకదారి నుండువారు
స్థలజలాకాశయానవైశద్యవిద్యఁ బ్రౌఢి నిస్సములగుచు నేర్పడెడివారు
నెవనిశ్రీచిహ్నలేశంబులవలెఁ గవులవాగ్వితానంబు వెలయుంత్రు వారి నెంతు.

సీ॥ వేదంబులన్ గావ్యభేదంబులన్ నిర్వివాదస్ఫురత్కీర్తి వఱలువారు
గానంబులన్ శాస్త్రిమానంబులన్ నూత్నధీనాటకముల నర్తించువారు
వైరంబులం దతిఘోరంబులన్ శాంతిసాగరప్రోత్కర్ష జరుపువారు
రాజ్యవ్యవస్థ వాణిజ్యోదయసంస్థ సామ్రాజ్యస్థితిన్ బ్రాధిమ నెడువారు
నందునం దప్పుడప్పు డద్వైతవిధముల సకలసత్వసమీక్షణమును జాలి
యెవనిశ్రీచిహ్నలేశంబులవలెఁ గవులవాగ్వితానంబు వెలయింతుర్ వారి నెంతు.

సీ॥ గురిగింజ యెఱుఁగునో కోకిలింది పెనుమచ్చ చూచువారలు చెప్పిచూపవలయు
నుద్రేకి కమరునో కోకిలయుచితజ్ఞత దెలియువారలు శాంతిదేర్పవలయు
గర్వి కాత్మజ్ఞానగౌరవం బలరునే శృంగభంగము సోకి చీరవలయు
శుద్ధసత్త్వం డాత్మశోభ గుర్తించునే యొఱపు దాఁటిచి లోక మెఱుఁగవలయు
నదను గదిరినవేళ నీ యూవిశేష మహిమ తెరచాటు విర్చు విమర్శకాళు
లెవనిశ్రీచిహ్నలేశంబులవలెఁ గవులవాగ్వితానంబు వెలయింతుర్ వారి నెంతు

వ॥ అని సమస్తసృష్టిస్థితిలయంబులకుఁ దదధిపతులకుఁ దత్పాలితులకుఁ బరిపూర్ణ
భక్త్యుత్సాహసమీహితసమారాధనం బొనర్చి సకలకళాత్మకుండై సర్వప్రారంభ
కారణుం డగు శ్రీమన్నారాయణు ననంతరూపంబుల నంతరంగంబున సంతరించు
కొని, నితాంతసంతోషాక్రాంతహృదయాంతరాళంబునఁ దద్విలాసమందహాస
సహవాససమాసాదితహాసోత్సాహాదిసమస్తకళ్యాణగుణజనకస్థాన మగు వసుం
ధరామాతకు సన్నిధానంబుఁ గల్పించికొని, మన్ముఖంబున నప్పగసెశ్వసంగా
పలుక నేర్పఱిచికొనిన సరసకావ్యసంవిధానంబునకుఁ గథాక్రమంబు.



శ్రీ హయగ్రీవాయ నమః

# తొలిపలుకు

ఆర్యపాఠక మహాశయులారా !

మ॥ నిగమాగోచరుఁడౌ పరాత్పరుని సాన్నిధ్యంబు మర్త్యాళి కె
ట్లాగ లభ్యంబగుఁ? దత్కళాజనితమై లోకంబునం దుండు జీ
వగణాకారతఁ గాదె; మీరు ముదముల్ బ్రాపింప నానందమొం
దుఁగదా దైవ మటంచు నీకృతికిఁ గూర్తున్ మీ సముపస్థితిన్.

నా జనకపితయగు నస్మద్గురుండు నగు భట్టాభిరామసోమయాజిగారు నా బాల్యంబునఁ బెద్దబాలశిక్షలోనివిషయంబుల నోటికథలుగఁ బ్రతిసాయాహ్నంబునఁ దెలుపునలవాటుమెయి నొకనాఁడు భారవిం గూర్చినయొకకబ్బములోనికథను వారిసహజమగు దేశికసామర్థ్యమున మన్మనంబున దృఢంబుగ నిలుచునట్లుపన్యసించి యుండుటచేత నది యచ్చటనే యీవఱకు నెలకొనియుండి యిప్పుడీకృతిరూపమున వెలువడినది. ఈ జనశ్రుతిగా వచ్చుకథగాక భారవికాలమును గూర్చికాని యాతనిమతి యే యితరవిషయములను గూర్చికాని యింతవఱకుఁ జారిత్రజ్ఞులు నిర్ణయమునకు రాఁగల సాధనములు దొరకలేదనుట యెల్లరకు విశదమే. ఈ వ్రాసిననాకథ కాజనశ్రుతి యొక్కటియే యాధారమై యున్నది. ఇందుఁ బ్రచురింపఁబడిన శ్రీవిద్వత్కవులగు- మ.రా.రా. శ్రీ వడ్డాది సుబ్బారాయఁడుగారి లేఖలో నీజనశ్రుతిగా వచ్చుకథ సంగ్రహముగాఁ దెలుపఁబడినది. అయ్యది వా రెవ్వరో యొక విప్రకుమారునకుఁ జెందినట్లు వినికి యనిరి. నాయెఱుక భారవికిఁ జెందినట్లే. దీని కుపబలముగా భారతమం దనేకకథలుండియుండ బాండవప్రవాసగర్భగతగాథనే తనకావ్యబీజముగ భారవి గ్రహించియుండుటయు "సహసా విదధీత న క్రియా" మిత్యాదులఁ బ్రవదించియుండుటయుం జూడ నీ జనశ్రుతి భారవికిఁ జెందినదే యని యూహింప నవుపడుచున్నదని నాతలంపు. "భారవిప్రవాస' మని ముందు వెలువడఁబోవు రెండవభాగమున నీవిషయము యింకను గొంతవిపులముగ నివేదించుకొందును.

ఇఁక నీప్రథమభాగమున భారవియవధానమున నాకాశపురాణమునకుఁ దిక్కనభారతములోని "సింగం బాఁకటితో" ననుపద్య మొసంగుటయు నప్రస్తుతప్రశంసలోఁ గవిత్వమును విమర్శనుగుతించి చెప్పునాశువునఁ గుకవినింద ప్రస్తావించుసందర్భమునఁ దిక్కనసోమయాజిని పెద్దనాదు లగుకవులప్రబంధములలోని విషయముల భారవిచేఁ జెప్పించుటయుఁ దత్సందర్భముననే ఘరాసుమంత్రి యగు రిమ్మ్యాను దడవుటయు నంతసమంజసములుగాఁ దోఁపకపోవచ్చును. భారవి తన సంస్కృతయుగము నాఁటి చర్యలే భాషలే పండితవాతావరణములే గొని యిం దవతరింపవలసియున్నచో నాకబ్బ మపరిచితములగువిషయములతో నిండి పండితపామరజనాదరణీయము గాఁజాలదను టొకటియు నాతని యప్పటిపరిస్థితు లవిదితములై యుండు టొకటియు నాధారములుగ నిటీవలియాంధ్రకవిపుంగవులమధ్య నతని నవత

బిడ్డఁడు సర్వజనులచే మహాపండితుఁడని కొనియాడఁబడుచుండ మీ రేల వానిని మెచ్చుకొనరని పృచ్ఛించుడు, జనకులశ్లాఘనము తనయుల కాయుఃక్షయకరమని నేను వానిని మెచ్చుకొనుగాని, వానిపాండితికి సాటియున్నదా యని యుత్తర మిచ్చుట నాలకించి, తత్కుమారుఁడు తటాలున నటుకపయినుండి యుఱికి తనపాప నిశ్చయము వారి కెఱుకపఱిచి, తద్దుష్కృతికి నిష్కృతి విధింపుఁడని వేఁడుకొనుటయు, శ్వశురగృహమునఁ గొంత కాల ముండుట దీనికిఁ బ్రాయశ్చిత్తమని పితరుఁ డానతీయఁగా నాతఁ డట్లు జరిగించి యచ్చో నెచ్చుగ నవమానపడి దుఃఖితుఁడయి యిల్లు చేరె " నను నానుడి గలదు.

పై కింవదంతిని భారవిచరిత్రముగాఁ జేకొని యయ్యయి తావుల రసపుష్టిని గలిగించుస్వభావవర్ణనములతోడను గల్పనాచమత్కృతులతోడను గథను బెంచి మనోహరముగాఁ గావ్యసృష్టి గావించితిరి. మధురమగు మీకవితాధార నొక్క బొట్టయిన విడిచిపెట్టక యాని యానందించితిని. భారవి పేర మీరు కావించిన యష్టావధానమును శ్లాఘించినరామావధానిప్రభృతులలో నన్నుఁగూడఁ జేర్చుకొనుఁడు.

భారవివివాహఘట్టమున వధూసౌందర్యమును వర్ణించుచు

" గవ్వకడుపుపగుల్ప్రక్కఁ గ్రాలుగిట్టు
యమరికఁజె నవ్వు కనుఱెప్పలందు వెలయు
చిఱుకురులవంపువరుసయుఁ జెలఁగెఁ దనదు
నుద్ది మనుజుల లే దనునుద్ది దెల్ప ॥ "

అను సీసగీతమునందలి పత్త్రోపమాన మపురూపమయి మెప్పునొందుచున్నది భారవి చరిత్రము రచించినమీరు మీతలఁపుచొప్పునఁ దత్కావ్య మాంధ్రీకరించికూడఁ బొగడు వడయుదురు గాక. ........."

---

బ్ర॥ వే॥ శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, మహారాణీపేట—విశాఖపట్టణము—14-3-1933.

" మీ భారవిని జూచితిని. భారవినిఁగూర్చి లోకములో వాడుకయందున్న యీకథకు, కావ్యరూపమును గల్పించుట యుచితముగా నున్నది. కవిత్వమును సరసముగానే యున్నది. ఇట్టి వీకాలమున వచనముగా నున్నచో నుచితమని తలంతురు గాని ప్రారంభించినపని పూర్తియగుటకు దక్కినభాగముగూడ నిట్లేపూర్తిచేయ యుక్తముగా నుండుననియే భావించితిని....ఇట్టికావ్యములుగూడ భాషలో నుండుట

యావశ్యకమే యని తలంచువారిలో నే నొకఁడనగుటచే నిట్లువ్రాసితిని. ...కవితాధార నిరర్గళముగా నున్నందుకు సంతోషించితిని మాతృభాషాభిమానము బ్రస్ఫుటమగుచున్నది.

---

బ్ర॥ వే॥ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు- నెల్లూరు- 12-3-1933.

“ ...... నాయందలి ప్రేమమునఁ దామంపిన “భారవి”ని విద్వత్కవులగు నామిత్రులతోఁ గూడి పఠించితిని. మీ కవనము జాతీయమై చవులూరు తెలుఁగు పలుకుబడులతో నిండి మిక్కిలి మనోహరముగా నున్నది. ఈ మార్గముననే భారవిని తెలిగింతురేని - ఆంధ్రభారతి కొకయమూల్యాలంకారముం గూర్చినవా రగుదురు. సంస్కృతభారవి-అచిరకాలముననే తెలుఁగుసోయగముఁ దేరి-ఆంధ్రరసికుల హృదయరంగముల నలంకరించుగాక.

ఈ ప్రథమభాగమును పఠించుటచే బొడమిన పద్యత్రయము నిట సమర్పించుకొనుచున్నాఁడను.

చ॥ అమృతపుజాలు లీల హృదయంగమభంగి నెసంగి యొంతయున్
సుమసుకుమారసారపదశోభితమై - కమనీయమూర్తభా
వము ఘనమై భవత్కవనపద్ధతి యుద్ధరసాస్వదంబునై
ప్రమదము నించు నోవిజయరామకవీ! యభిరామవైఖరిన్॥

గీ॥ సరసకవితాకళారహస్యజ్ఞులైన।యిచటివిద్వత్కవులు భవత్కృతిఁ బఠించి
మేలుమేలని తల లూఁచి మెచ్చుకొనిరి।యింతకంటెను కవికి నింకేమివలయు॥

ఆ॥ వె॥ పిన్నవాఁడు విన్నచిన్నికతన్ గొని । వన్నెవెట్టి హృద్యపద్యములను
నవ్యరీతి దివ్యకావ్యమ్ముఁ గూర్చిన । మీదుప్రతిభ నెవరు మెచ్చకుంద్రు॥

---

బ్ర॥ వే॥ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు, ఇంటూరు-15-3-1933.

...... ఈ గ్రంథమున స్వభావోక్తియే ప్రధానముగా నెలకొల్పఁబడినది. ఇంతకుము న్నీకవి రచించినవానిఁ గొన్నింటి వింటి, వానికంటె నియ్యది మధురతరముగాఁ జూపట్టుచున్నది. ......... ఈ గ్రంథమునందు కుశాగ్రబుద్ధిలక్షణము, దద్విజయమును, బండితసన్మానమును, వధానవిధానమును ముఖ్యోద్దేశములుగాఁ బాదుకొనఁజేయఁబడినవి. అచ్చటచ్చట రాగములనామములును బేర్కొనఁబడినవి. “లోకే యద్య ద్విభావ్యతే తత్సర్వం కవినా ప్రోచ్య” మనినట్లు, ప్రతివిషయము

సమంజసముగాఁ గూర్పఁబడినది. ఈ కవి యిట్లే యింకను ననేకగ్రంథపుష్పమాలి కలచే భాషాయోషామణిం గై సేయుఁగాత.

ఉ॥ "ధాత్రివతారముల్ కవయితల్ సరసప్రతిభాలవాలమం
దాత్రియివోలె గూఢపరమాణువులై తగు కావ్యబీజముల్
పాత్రమునాడు పుష్పఫలభారములన్ వెలలన్ గ్రహింతు రీ
సూత్ర మెఱుంగలేరు కవిసూనులు తిర్పతివేంకటేశ్వరా!"

---

బ్ర॥ వే॥ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, నెల్లూరు కాలేజీపండితులు
ముఖతః నుడివినది. 19-3-1933

సంస్కృతములతోఁ దెలుఁగుల జోడించునేర్పు గలదు. ధార బాగుగనున్నది.

---

శ్రీః

తెలుఁగుబాసకవితలకలరూ పెఱింగినకవివర్యా!

తాము రచించిన భారవి యను పద్యప్రబంధపుఁబ్రథమభాగమునందలి రసవంతములగుఘట్టములను సావధానముగఁ జదివితిని. ప్రాచీనకవితాదరము పెడఁబాయక యట్లని కేవలము తదభినివేశము పొల్గాక నవీనకవితాపద్ధతి నద్దాని కొకవింత చెలువమును గూర్చు మీకవిత నాఁటి నేఁటికవితల కాదర్శమనుట యతిశయోక్తి గాదు. అలఁతియలఁతి తేటతెలుఁగుమాటలనీటుతోడను, దొసఁగు గనరాని మిశ్రసమాసముల సౌరుతోడను, వెదకినం బెట్టు పొదలని శుద్ధసంస్కృతసమాసముల యందము తోడను, నతిలలితమై లలితార్థప్రకాశనక్షమమై మీకవితారీతి రసముం జిప్పిలఁజేయుచుండుట కెంతయు నలరితిని. వ్యర్థపదరాహిత్యమును, బదమధ్యయతియు మీకవితయందు విశేషించి యెన్నఁదగువిశేషములు. ఇట్లు నిర్దుష్టముగఁ గవిత నల్లఁగల కవికుమారులు నేఁ డరుదనుట యసంభావ్యము గాదు. కవిపుంగవులను నానుడిం గాంచినకవిశేఖరులకవితకన్న మీభారవికవిత యొల్లభంగుల మేటియనుట యసంగతము గాదు. అవధానమునందలిడకారప్రాసోత్పలమాలికయు, సప్రాసాశుధారయు, మీకవితాపాటవమును వెల్లడింప వలఁతులైయున్నవి. "విందు, గర్వము, విషాదము," అను కథాభాగములు మీరసమును బెంపొందించుశక్తిని, నాచారవేదిత్వమును, సహృదయతను, జాటుచున్నవి. ద్రుతంబులయున్కి చిత్రవిచిత్రముగ మీకవితం గన్పట్టుచున్నది. ఆంధ్రభాషావిశారదులు గాఁగోరువారలకు మీభారవి

కవిత యవశ్యపఠనీయము. ఇతోధికముఁ బూన్కిని, కవితాకృషి యొనర్చి తత్ఫలంబుల నాంధ్రకవితామాతం దనుప సర్వశక్తుఁడు సర్వేశుఁడు తమకు దీర్ఘాయురారోగ్యములఁ బ్రసాదించుఁగాక. చిత్తగింపుఁడు.

విజయనగరము
**4-4-1933.**

విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రి.
శ్రీ మహారాజ సంస్కృతకళాశాలాంధ్ర ద్వితీయోపాధ్యాయుఁడు

---

*My dear Sir,*

I went through your rendering of the Bharavi the First Part into Telugu Poetry with much interest Your style of versification is simple chaste and flowing like a river in floods and at the same time it is attractive and quite natural It does not look like a translation at all It appears as if it is an original piece of poetical work that flowed naturally It is a natural gift and not an acquired versification I congratulate you on the success you achieved in your first attempt I pray that God give you long life, peace of mind & prosperity to continue your services to the Andhra Saraswatam and enrich it with your gifted works

ELLORE,
5-4-1933.

*Yours Sincerely,*
Rajah M Bhujangarao.

---

ఆర్యా,

నమస్కారములు. ఉభయకుశలోపరి. తాము దయతో బంపిన, "భారవి" చేరినది. మీ కావ్యమునందలి కథావస్తువును, శైలియు, ప్రాచీనకవులపటిమను, నూతనకవులకల్పనాకౌశలమును వెల్లడించుచున్నవి.

ఇట్లు,
సా. వెం. నరసింహాము,
ఎం. ఏ.

ప్రభుత్వకళాశాల,
రాజమహేంద్రవరము.

---

# తప్పొప్పుల పట్టిక.

—— o ——

| పద్య సంఖ్య. | పాద సంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 1 | ఎనుబదియారు | ఎనుబదిరెండు |
| 5 | 2 | మలవిసర్జనరుగాఁ | సెలమిచేకూఱఁగా |
| 6 | 4 | ఘటికుఁడయ్యె | ఘటకుఁడయ్యె |
| 11 | 1 | క్షీడార్థమై | క్రీడార్థమై |
| 28 | 1 | మేలే | మేలె |
| 62 | 4 | పైశాచములఁగాంతు | పైశాచముల కాంతు |
| 75 | 3 | తోయం | తాయం |
| 123 | 1 | ఊహాః | ఊహా |
| 124 | 4 | దాకినిక్ష | దానికిక్ష |
| 136 | 3 | సౌఖ్యతక్ష | సౌఖ్యముక్ష |
| 187 | 4 | నాఖ్యరుచిరంబు | నాజ్యరుచిరంబు |
| 211 | 1 | గురుండనెడి | గురుండయను |
| 240 | 2 | ద్వితీయ | ఁద్యుతీయ |
| 276 | 3 | కష్టము | క్లేశము |
| 286 | 4 | పునీతమొనర్తు | ను దిద్దుచునుండురి |
| 288 | 3 | రొఱుంగకే చని | రొఱుంగకే జని |
| 330 | 4 | కేమిఁగలమో | కేమి చ్చెదమో |
| 367 | 3,4 | మా । రాక | మారాక |
| 380 | 2 | పరువుప | పలువురు |
| 421 | 2 | రాజసమితికోటీర | రాజవిలసత్కోటీర |
| 421 | 4 | నస్మాద్వృ | అస్మాద్వృ |
| 480 | 4 | నదిదూఁగు | సరిఁదూఁగు |
| 487 | 2 | కంబుసూపక | కంజసూపక |
| 508 | 3 | ఁజేతు నేని | ఁగూర్తు నేని |

తక్కుంగల ప్రమాదములన్నియు సహృదయు లగు చదువరులకే వదలఁ బడినందుకు క్షమింతురుగాక.

ఓం

# భారవి

## ప్రథమభాగము

క॥ అనఁగ ననఁగ మును పుత్తర
మున సంస్కృతభాషఁ గావ్యములు పుట్టి జగం
బున కానంద మొసంగెడు
దినములలో నైనవింత దెలిపెద వినుఁడీ. 1

—♦ భారవి బాల్యము ♦—

సీ॥ తెలిమి యుదాత్తానుదాత్తస్వరిత వేదఘోషఁ గొల్పెడు విప్రకోటితోడ
నెలకుపితోటకొమ్మలపల్లవఫలంబు లా రుకోయిల చిల్కగానములను
సెనుకొండలన నిండుకొనియుండు కసవుచాముల పేయుపాడితొట్టులబలముల
ధాన్యపుఁబారు లెక్కి తమపురుల్ వేరయించి పజ్జ మీను కలాపిజాలములను
సాడిపంటల నిండి సంపదలు వొదల సొగసుగంతెలమక్కువం జొక్కుచుగలఁ
దెనుఘవంతులఁ బాకలఁ గనులవిందు సలుపునొకపల్లె మును జెల్లె సౌఖ్యనియతి.
చ॥ ఎనుబదియాఱుపన్నముల నెందు ఘనాంతముగాఁగ నేర్చి వ
ర్తనఁ గడుశ్రోత్రియత్వము ప్రధానముగాఁగఁ గలంతలోన దా
ననియతియున్ వహించి, సుగుణంబుల ప్రోవయి భార్య పేలిసే
వన మొనరింపఁ దుష్టి నొకవాఁడుఁ డటన్ వసియించు శాంతుఁడై. 3
శా॥ చేయున్ జాపనియంతకల్మి వెలయన్ శిష్యుండు నిత్యాగ్నిహో
త్రాయామంబులచేత "జి"జ్జనని దేహారోగ్యమున్ గల్గి యా
ప్యాయం బీఁదగు పాడితోడ సుతసౌఖ్యం బొప్ప సంపూర్ణమా
హాయిన్ భూసురుఁ డం దెసంగు నిరతం బత్యంతసంతుష్టుఁడై. 4
సీ॥ తొలివేగుఁజుక్క ముందుగ లేచి హిమకణాసారశీతలవాయుసారగతుల
మలవిసర్జనకుఁగాఁ బొలము దవ్వేగి వచ్చినవెన్క నుత్తరేణిని ముఖార్జ
నం బొనర్చి సుతుండు వెంబడిన్ జనుదేఱ నిగమపాఠం బాతనికినిఁ జెప్పు
చొను చేగి యేటిలోనను మజ్జనం బాడి ప్రాహ్ణకృత్యంబులఁ బఱగఁజేసి

కొని గృహంబున దేవతార్చన మొనర్చి యతిథులను దేవతాభక్తి నాదరించి
యిట్టిశమశీలి పృథ్విని నింకెవ్వఁడనఁగ నలరు నవ్విప్రుఁ డటు వదాన్యత గడించి. 5

క॥ ఆతనితనయుం డతిమేధాతీక్ష్ణతఁ జుఱుకు గలిగి తండ్రి గురువుగాఁ
జాతుర్వైదికపఠనసవాత్రితంబుల ఘటికుఁడయ్యెఁ బదియేఁడులలోన్. 6

ఉ॥ అంతట శాస్త్రషట్కనిగమాంతపదార్థమహత్త్వవేది సి
ద్ధాంతఘనాధికారి పరతంత్రితమోహమహాద్రిపవిభారుక్కుఁ డ
త్యంతయశఃప్రకాశిత దిశాంతరుఁ డాతని మేనమామ దే
శాంతరసూరిజేత యయి యచ్చటికిన్ జనుదెంచె నొక్కచోన్. 7

ఉ॥ వచ్చిన బావమున్ బ్రణతివ్రాలి యథార్హత నర్ఘ్యపాద్యముల్
చెచ్చెర నిచ్చి వస్త్రమిడి సేమము నారసి షడ్రసంబులన్
మెచ్చెడుభోజనం బొసఁగి మేలగుశయ్య శ్రమంబుఁ దీర్చి మేల్
ముచ్చటలాడుచున్ గడిఁదిమోదముతోడుతఁ బ్రొద్దుపుచ్చుచోన్. 8

వ॥ నేపథ్యమందు— 9

క॥ "మామామ వచ్చినాఁడఁట, యేమో జగమంత గెలిచి యేగడునఁట, యే
నామహిమ దెలిసివచ్చెద మీమీయల్లరులు వదలి మీరును రండీ!" 10

మ॥ అనుపల్కుల్ సనుదేర "వాఁడెసుమి నీయల్లుండు క్రీడార్థమై
చని యేతెంచెడి, సుంత బాలకునిప్రజ్ఞన్ జూడుమీ" యంచుఁ ద
జ్జనకుం డాడెడుచోఁ గళాకలిత మాస్యం బోఱగా వంచి క్రీఁ
గనులన్ మామను జూచుచాతఁడు వడిన్ గన్నయ్యఁ జేరంజనన్. 11

క॥ "బాలుఁడవో! బాలికవో!! సిగ్గేలా? రావోయి యిట్టు, లేవీ నీవున్
జాలఁగ నేర్చితివఁట వేదాలాపము! నాలపింపుమా యేదేనిన్." 12

క॥ అనుమేనమామకై చప్పున మొగ మెగయించి "నీవు మొనగాఁడవె యే
మని జైత్రయాత్ర వెడలితి వనుమానమె లింగభేద మారయలేవే? 13

క॥ నీమేలంబు నెఱుంగఁగ లేమే మని నాగరకపులీలఁ బలుకుని
వ్యామోహ ముజ్జగింపుము మామా! అర్థంబు రానిమాచదు వేలా?" 14

మ॥ అని పోఁబోయెడిబాలుఁ దజ్జనకుఁ డందల్లంత నే యాపి "నా
యన! యిట్లుందగునయ్య పెద్దలను బోనాడంగ? నీమేనమా
మను గన్గొమ్ము సుమాళివై వెలయుఁ, సంభావించి సాష్టాంగదం
డనమస్కారమొనర్చి దీవెనల నొందంబోలు టూహింపవే? 15

క॥ అనిజనకుఁ డనినఁజిఱునవ్వున మోమునఁ దళుకువన్నె మెఱుఁగుగొలుపఁ గా
వినయమున మామయంతికమున దండము వెట్టి నిల్చి మోడ్పుఁగరములన్ 16

ఉ॥ "మాటకు మాట చెల్లె, నిఁక మామకు నాకును బాకి లేదు, వే
దాటవి గుడ్డిగాఁ దిరుగులాడున నన్ హసియించెనంచునన్
బోటుగుమాట నంటి నది పోవఁగనిచ్చి తనంత మేటి వా
గ్ధాటి యొసంగఁ బండితునిగా నొనరింప నమస్కరించెదన్". 17

క॥ బాలునిసమయస్ఫూర్తికి ధీలాలిత్యంబునకును దెంపునకు వెఱన్
సోలి కడుఁబ్రీతి మై గఱిదేలఁ గరంబులను సాఁచి తిగిచి నిమురుచున్. 18

క॥ అబ్బురము పేర్మి మోదము ప్రబ్బినగద్గదిక నెనయు పల్కులఁ దొడలం
దుబ్బున నిడుకొని పలుమఱు నబ్బాలకు ముద్దులాడి యతఁ డిట్లనియెన్. 19

మ॥ "మఱఁదీ! పిల్లఁడు గాఁడు వీఁడు గడుసౌ మాటాడి తూలించె నే
వెఱపున్ లేక ననున్, సమర్థత నుడిన్ వెల్గొందు మేధావి, యీ
చిఱుతన్ బంపుము పండితోత్తమునిగాఁ జేయింతుఁ గాశీపురిన్
గొఱతల్ దీఱిన కోడెతాఁచువలెఁ గైకోఁ డీతఁ డెవ్వారలన్. 20

క॥ వెనుదీయకు" మను బావన్ గనులం దాతురతఁ దెలుపు కన్న కొమరునిన్
గనుఁగొని యాతని పెంపున్ మనమున యోజించి తండ్రి మఱియిట్లనియెన్ 21

క॥ "బావా! నీమాటకు వెలిగా వర్తించెదనె నీదుగాదిలి చెలియల్
పోవయ్య యనినఁ జాలును నీవాఁ డతఁ డింక వాని నెఱి నీది సుమా!" 22

## —♦ భారవి కాశీప్రస్థానము ♦—

చ॥ జనకుననుజ్ఞకున్ ముదముజాల్గొనఁ దేఱినదృష్టి మామనుం
గని జనయిత్రి యున్నెడ కెకాయకి లోగృహసీమ కేగి మా
తను గని "తల్లి! మామ నను దావసియించెడుకాశి కేగుదె
మ్మనియెను నాకుఁ గావలయునన్నిఁటి సర్దుము లెమ్ము గొబ్బునన్. 23

క॥ ననుఁ బండితుఁగా నొనరిచి పనిచెడునఁట జగములోని పండితులను మా
మను బోలి నేను గెలువన్ ఘనసయ్యెడు" ననుచు సుతుఁడు మల్లడిసేయున్. 24

ఉ॥ "అల్లరి సేయకయ్య! చను టంతగఁ దప్పనిదయ్యె నేని నీ
తల్లియె యడ్డు నిల్చునె? సుతా! నినుఁజూడనిరోజు నాకు జా
బిల్లియు లేనిరాత్రివలెఁ బ్రీతి యొసంగదు, చిన్నితండ్రి! నా
మల్లియ! నోముపంట!" యని మాటికి మూర్కొని బుజ్జగించుచున్. 25

ఉ॥ "బంగరుబొజ్జ! నాదు పసిపాపఁడ! నిన్విడి యిల్లు నిద్రవో
వుంగద చక్కనయ్య! కులమున్ వెలయించు తలంపు మేలెయై
నం గడుతెంపు నామదిఁ గనంబడదయ్యెడు; నిన్నుఁ బొమ్మనన్
బొంగులువారి యేదొ మనమున్ గలఁగించెడు నేమిసేయుదున్." 26

క॥ అనునెడ బావయు మఱఁదియు వెనుకగఁ జనుదెంచి పొంచి విని దీనికి నే
యనువునఁ బలుకునొ బాలకుఁ డని చాటునఁ దొలఁగినిలువ నతఁ డుత్కంఠన్. 27

మ॥ 'జననీ! కన్నుల నీరుగ్రమ్మ నిటులన్ జాలిన్బడన్ పేలే? పొ
మ్మని దీవింపుము, ధీరమాత వగు మమ్మా! సుంతలో మామ యా
ననఁ బాండిత్యము నొంది నే మరలి రానా? దిగ్విజిగీషాగతిన్
నిను మాయయ్యను గీర్తిడోలికలలో నెక్కొల్పి సేవింపనా?" 28

శా॥ ముద్దుప్పల్కు నిటు ల్లపింపకుము మోహుం గాంచి నాఁ డెవ్వని
న్నుద్దేశంబున వానికన్నులను నీ రూఱంగ "నమ్మా! యిటుల్
మొద్దుంబాఱిన చిత్తవృత్తి గన కింపుల్వారు నాకానవే
ల్పుద్దిం గాదను పెల్లుకో" యనుచుఁ జుంబన్ బువ్వి లాలింపుమన్. 29

ఉ॥ పైఁటచెఱంగునన్ గనులవారెడినీరము నద్ది "యయ్య నీ
మాటకుఁ గాదనన్ గలనె? మామ పరాయియె! కాదు, గాని నే
పూటవు నీకుఁ గాఁదగినపోషణ కెవ్వరొ యింకనంచు లో
మీ పెడితొందరన్ మది భ్రమించెడి మోజన డిందునక్కటన్. 30

సీ॥ ఆఁకలిపాటు సుంతైన నెఱుంగవు పోరి పెట్టిఁగాని బువ్వ తినవు
అభ్యంగనస్నాన మాడింతు రమ్మన్న నూరంత దిప్పింతు పోఁబెట్టి
నిత్యంబు దల దువ్వి నీరార్పఁ జిందులఁ దొక్కి యంకెకురాక తోఁసి చనెదు
కాదు గూడ దటంచు గగ్గోలు గావించి పట్టినపట్టు గూర్పకయు విడవు
కన్నకడుపుగానఁ జిన్నయ్య! యివి యన్ని ముద్దుసేఁతలనుచు మురియు దేను
నాదుబంగరంబ! నాయన్న! మనసెక్క నీదుచనవు లచట నెగ్గునొక్కొ?" 31

మ॥ అన "నమ్మా! మది బెంగగైకొనకు నీ కామోదముంగూర్చు బు
ద్ధిని నీచెప్పినవానిఁ జేసితిని సుంతే నల్లరింజేయ నీ
పను లంచేఁ బొడగన్నఁ జేయఁడునె! యీపైబుద్ధిమంతుండనై
యనువర్తించెద నత్తమామలఁ దదీయాజ్ఞాప్రకారంబుగన్. 32

ఉ॥ పంపు" మటంచు గడ్డమును బట్టి మొగం బెగయించి యోష్ఠముల్
గంపమునొంద జాలితరగల్ దనకన్నులనుండి జాఱ ని

ద్దంపు మొగంబు దల్లిదఱిఁ గాఁపుగ నుంచి రసార్ద్రదృష్టులన్
నింపుచు నామె కన్గవను నిశ్చలతన్ బరికించుచుండఁగన్. 33
ఉ. బిడ్డశిరంబు నాత్మభుజపీఠిని జేర్చి కవుంగిలించి మో
మద్దముగాఁగఁ గ్రప్పి “తనయా!” యని “ఱెక్కలురాని చిన్నినా
గుఱ్ఱఁడ నిన్ను దవ్వునఁ గొల్పదు నామన” మంచు దుఃఖమున్
జడ్డున మున్గువారిఁ గని చయ్యన నామెసహోదరుం డనున్. 34
ఉ. “చెల్లెల! యిట్టు లన్యులుగఁజేసితె నన్నును, నాసతీమణిన్
బిల్లలు లేనిమాకొఱఁతఁ బ్రేమముతో నిటుతీర్పరాదె? నా
యల్లుని బ్రాణతుల్యునిగ నారసి పెంచనె పెద్దఁజేయనే?
యుల్లము డిందఁ గుందుపడ కూఱడి పంపుము వీని సమ్మతిన్. 35
మ. ‘అగునండీ పదియేఁడు లయ్యె ననురాగాయత్త మీచెల్లియల్
మగకూనన్ గనె నన్నమాట విని ప్రేమన్‌బోయి వీక్షించుటో
తగురీతిన్ గొనివచ్చి మేలుమరియాదన్ దేర్చుటో లేదు మీ
తగవున్ ధర్మము మీకగా కొరుల కాత్మన్ మోదముంగొల్పునే?’ 36
చ. దినదిన మిట్లు మీవదినె దెప్పుట నాఁటికినాఁటి కెద్దియో
పని గెడపంగరానిదిగ వర్తిలుటన్ దడవయ్యె మీరు నా
మనసు నెఱుంగువారె కద మాఱన కచ్చట నొక్కనాలుగేన్
దినములు వుచ్చి రాఁదగును దీర్పుఁడు ద్రోయక నాదుకోరికన్.” 37
చ. అని బలవంతమున్ సలిపి యామఱునాఁడె ప్రయాణమై, గుడుల్
గనఁదగు చిత్రముల్ గనుచుఁ గాశిని జేరి ప్రపత్తి విశ్వనా
థుని దరిసించి తక్కఁగలతోయములం దఘమర్షణంబుగా
మునిఁగి సుఖంబుగా రకపుముచ్చటలం దొకకొన్నివారముల్. 38
మ. గడువన్ బుత్రుఁడు మేనమామకడ నాగన్ దల్లిదండ్రుల్ ప్రియం
పడి స్వగ్రామముఁ జేరిసౌఖ్యముల నిల్వన్‌బోయె నేఁడేఁడు లా
నడుమన్ వచ్చినవార్తలన్ దనయుఁజ్ఞానప్రౌఢిమన్ జొక్కి యె
న్నఁడు కన్గొందుమొ యంచు వారముల నెన్నన్ సాగి రాదంపతుల్. 39

—♦ భారవి దిగ్విజయము ♦—

చ. ఇనుఁ డుదయింపఁబోవుటకు నెంతయు ముందటఁ దత్కరాగ్రముల్
గొనలుగ సాఁగి ప్రబ్బి వెలుఁగుల్ జగతిన్ వెలయించుపోల్కిఁ ద

త్తనయుఁ డఖండపండితులదర్పము మాపినకీర్తిగీతముల్
విసుకలిబాట గ్రామమున విస్తరిలన్ దమిగాంత్రి దంపతుల్. 40

క. స్వాతికి ముత్యపుఁజిప్పలరీతిఁ జనోగములగములు రేగా జానకై
ప్రీతివడుభాతి సుతుఁగన నాతలిదండ్రులు గుణించునపుడొకనాఁటన్. 41

—— భారవి గృహాగమనము ——

సీ. కడిమిమై లాగినగండపెండారముల్ డాకాల నొలసి తాండవము సేయ
గురువాదముల నూడఁగొట్టిన బిరుదుగంటలు చెండ్లకొనఁజుట్టి గంటలు లులియ
శతవధానవిధానచాతురిన్ గాంచినపతకముల్ మాలలై కుతుక వ్రేలఁ
బ్రౌఢపద్రబంధనిర్మాణంబులన్ గొన్న కంకణంబులు కరాగ్రముల వెసఁగ
నాశుకవితాసుధాధార నందుకొనిన చామరంతుల్ వెల్లికొల్లలై యల్లో వెలయ
నుబ్బి తబ్బిబ్బగుచు దండనుండి మేనమామ చనుదేర సుతుఁడు గ్రామంబుఁజేరె.

చ. ఇనుఁ గని విచ్చుపద్మములయేపునఁ జిత్తము లుల్లసిల్లఁ జం
ద్రునికళఁ జంద్రకాంతములు తోయముఁగార్చురీతిఁ గన్గవల్
ఘనత ముదశ్రువు ల్గురియ గాఁడిలిపుత్త్రుని మొక్కులంది బి
గ్గను గవుఁగిళ్ళఁ బ్రేమ లెగయన్ దలిదండ్రులు సంతసంబునన్. 43

గీ. తనువు లిఁక సంతలుగ మహోత్కలిక లమర
నాగతులకు మనస్ఫూర్తి స్వాగతంబు
లొసఁగి శకటాంతరంబులం దున్నవస్తు
సంతతుల నింటిలోపల సర్ది పిదప. 44

శా. “ ఏమే ! యెన్నడురాని నీవది నేఁ డేతెంచె నిం దామె నీ
వేమాడ్కిన్ ముదమందఁజూచుకొనెదో యేతీరొ నీనేర్పు, నా
యామర్యాదలు మంచిపెద్దలును నీకాయత్తముల్ , పూర్ణమా
ప్రేమన్ నీసుతు సాకె నీవెటుల సంతృప్తాత్మఁ గావించెదో ! ” 45

చ. అని సతి నెచ్చరించుపతి నారసి పత్ని వచించు “ నా, నెటుం
గనె ? మును గాశి నారయనె కన్నకుమారునికంటె మిన్నగా
మనసుతు నామె చూచుకొనుమన్నన పెంపును, గల్పకోటి ? దా
ననెగద ! వాని నామె కెలనన్ విడి దైర్యముఁజెంది వచ్చుటల్. 46

వ. అది యటు లుండనిండు, సుతు నాగతిఁ గైకొనిపోయి గొప్ప లౌ
చదువులఁ జెప్పి పండితునిసల్పినబావపరిసంగ మేమియున్

మదిఁగొన నొక్క మాఁదిని మాటలొ పల్కెద రార యొక్కటన్
వదలూనె పక్షపాతి ” మనుభార్యను జూచి హసన్ముఖాబ్జుఁడై. 47

ఉ. "చెల్లెలు నన్ను - నే విడిగఁ జెప్పఁగనేటికి? - జాట్లుపాకైగా,
పిల్లఁడు వచ్చె నేపముగ, బిల్వము బంధుల, నిందు విందు కేఁ;
జెల్లె కుమారువిద్యసభ నేర్వఁబడన్ వలయున్; గృహస్థితిల్
కొల్లగ మెచ్చుకొన్నయును గూర్పము దైవము పేరు మీఁగురన్." 48

—◊ భాంపి - సింయు ◊—

క. అనిసతికిఁ జెప్పి యిరువురుఁ జని యెల్లరఁ బిలిచి వలయు సంభారములన్
గొనితెచ్చి యింటఁ దగుపను లొనరించుచు నాగ్రహస్థుఁ డుండెడు సంతన్. 49

క. 'విస్మావటో విడా! మన పున్నాయకయ్య కొడుకు ప్రఖ్యాడు చదువుల్
బన్నుకొని వచ్చినాఁడఁట నిన్నటివాఁ డెంతయయ్యెనే యింతటిలోన్." 50

క. అని యొక్కగరిత యన నొకవనిత పలుకు "నెంతవాఁడ! ఎళ్లి! వినలేదే
మొనగాండ్రగు పెనుపండితులను సులువుగ శాస్త్రచర్చలన్ గెల్చెనఁటే!" 51

చ. అనిన మఱొక్కచాన "గెలుపన్నను గెల్ప!! అదేమిటేమిటో
తనిసనఁ బండ్లకెత్తుకొని తాఁగొనివచ్చెనఁటోయి! యబ్బురం
బెనయఁగ వాని పేర్లు వచియించిరి విస్మృతి సోకె,- సేలువల్
ధనములు కంకణంబులఁట దండెకడెంబులఁటే తొడాలఁటే. 52

క. "కుడువఁగఁబోవుచు రుచిపస లడిగెదు నట్లయ్యెఁ బోనసన్నియుఁ గనవే?
కడుఁబొద్దెక్కెడు రండో!! వడి వంటకు రమ్మటంచు బిలిచిమాలెఁగదా!" 53

గీ. అనుచు నొకయింతి విసవిసనరుగు మండ "సౌరె, యెందుఁబిలుక్కన నామె ముందు
వచ్చి నడికట్టుగట్టి నిల్వఁబడి సద్ది నిలగఁబని సేయఁ ద్వరగఁబోవలయునమ్మ."

క. "మఱచితిఁ బూసలగరి డెమఱకయ తెమ్మనుచుఁగోరె మగవా!" యని లో
నఱనున్నదానిఁ గైకొని పఱతెంచె నొకామె వెడలి పటువేగమునన్. 55

క. ఈగతిగా నాగ్రామము లోఁగల వార్తాలు పెఱుగులున్ గొనుచున్ రా
గాఁ గాపులు పెనుతట్టలతోఁ గూరలు డింప ముదము తుములం బయ్యెన్. 56

క. మనచిన్ననాఁటి సచివుఁడు ఘనుఁడై చను దెంచెనంచుఁ గదు మోదమ్మున్
గొని వటువులంటుఁ దీర్థముఁ గొనివచ్చిరి యేటినుండి కొల్లగ మడితోన్. 57

ఎ. అఱమర లేక విందునకునై పిలువంబడి వచ్చువార లె
కొఱఁతయు లేని నేస్తములఁగూడి స్వకార్యమురీతిఁ గూరలన్

దఱుఁగుట నుంచి యన్నిటను దాము సుభాగ్గొని బంధుమైతిరి యీ
తెఱఁగగు నే యటన్న వినుతిన్ దగుచర్య వహించి రచ్చటన్. 58

సీ. అంగవస్త్రంబుల నాఱఁగట్టెడువారు బియ్యంబు వడియించి పెట్టువారు
గాడిపై గుండిగల్ జోడించి యెసళుల మఱగించుటాదిగా నరయువారు
వేఱుప్రియ్యులనైనఁ బెనముల భాండీలఁ బిండివంటలఁ జేసిపెట్టువారు
తిరుగఁబోఁతల దించి తెచ్చి మేల్ రుచులెక్కఁ బచ్చడుల్ నూరి యందిచ్చువారు
నూఱుఁగాయలు వడియఁబు లూఱుఁబిండ్లు తెచ్చి వడ్డనపాత్రలఁదీర్చువారు
నేయి గరగించువారు వడ్డించువారుఁగాఁగ నాపాకశాల గ్రిక్కిరిసి పొదలె. 59

గీ. నిండుచందమామ నింగిఁ జుక్కలముంచి పృథ్వి నెల్లఁ బాలవెల్లినించు
నటులఁ బూర్ణమాంబ యందఱ కన్నిరూపులను మెలఁగి ముదముఁ బొంగఁజేసె.

క. అట దేవతాగృహంబున జటిలుర్ ఘనలుర్ సమగ్రసన్నాహములన్
స్ఫుటగతుల మించె వక్తలు ఘటులు లనుట తేటపడువికాసంబులతోన్. 61

సీ. శ్రుతి నమస్తే రుద్రమన్యవాదుల భక్తిచే నభిషేకంబుఁ జేయువారు
నప్పుడే వచ్చి దర్భాసనాసీనులై మాధ్యాహ్నికమునకై మలయువారు
నోన్నమఃపూర్వకం బుచ్చైర్ధ్వని సహస్రనామార్చనంబు నొనర్చువారు
గంట మ్రోగించుచుఁ గదలిపోండని భూతపైశాచములఁ గాంతుఁ బల్కువారు
పీకి ముక్కంటిపండ్లపైఁబీచు దీసి కొట్టి కొబ్బరి స్వామికిఁ బెట్టువారు
వెలయు నాదేవతాగృహం బలసరస్వతీయన ర్తనశాలమై తేజుమిగిలె. 62

క. ధూపంబులఁ గర్పూరపుదీపంబుల సుమసుగంధదీపితరుచిమ
ద్రూపంబుల నాలో నపురూపపువాసనలు చదలఁ బ్రోదిసెసంగెన్. 63

వ. అప్పు డాగృహస్థుండు నిర్వర్తితస్నానాదిమాధ్యాహ్నికకృత్యుండై. 64

క. గోడకుఁ బసపుంగుంకుమతోడన్ శ్రీవేంకటేశు దొడ్డపదంబుల్
జోడించి దిద్ది నడుమన్ నాడెంబుగ నామ ముంచి నాటినభక్తిన్. 65

క. గంగాజలకలశంబులఁ జెంగటఁ బీఠముల నునిచి శ్రీవిష్ణుకళా
లింగితసాలగ్రామములం గొని హరివాణమందు లలి నిడి పిదపన్. 66

క. భువనేశ్వరాంతరంబున శివవిష్ణుప్రతిమలందుఁ జేరిననిర్మా
ల్యవిశేషముఁ దుడిచి సమర్హవిధిన్ దేవార్చనమున కాయత్తుండై. 67

గీ. కలశజలముల శంఖమున్ గడిగి తుడిచి వారి నించి సుమాదులఁ బైఁజల్లి
తిరుగఁబూరించి కైసేసి దిమ్మె నునిచి క్షీరమధునారికేళాంబు పూరణముల. 68

క॥ సాలగ్రామంబుల స్వరజాలము లుడివోనినమక చమకాదుల శ్రీ
ధ్రాలక్ష్యంబులు పురుషై గ్రాలఁగ నభిషేకమిచ్చి కడిగి తుడుచుచున్. 69

గీ॥ సంపుటంబుల నిడి గంధచర్చ సేసఁగ నక్షతలఁ బూవులను 'నృసింహాయ సరస
బాలగోపాలమూర్తయే స్ఫటికలింగమూర్తయే నమ' యంచు మేల్బుద్ధి నొసఁగి.

ఉ॥ సాంబసహస్రమున్ హరిసహస్రము శ్రీలలితాసహస్రమున్
బంబినభక్తిఁ జెప్పుచు నుపాయనముల్ గ్రమయుక్తి నిచ్చి వ
స్త్రంబు లొసంగి జందెముల సత్కృతిఁజేసి ప్రశస్తధూపదీ
పంబులతో నివాళులిడి వ్రాలినభక్తి నిమీలితాక్షుఁడై. 71

ఉ॥ "నీకలరూపు లోకులకు నిర్వచనం బొనరింపఁబూని ని
ర్వ్యాకులవృత్తి సాగి పరమార్థము చేటతెనుంగు సేయఁగా
లేక నివర్తనంబునఁ జలించెఁ టానిగమంబు, లేను శా
క్యాకులితాత్ముఁడన్ నిను సమగ్రముగాఁ గొనియాడనేర్తునే ? 72

ఉ॥ వేడిన వేడకుండినను విజ్ఞత కల్గినఁ గల్గకున్న నీ
వాఁడను బ్రోవుమన్న గరువంబున నిర్దనకున్న సేవ కే
జాడల నెప్పుడే వెలిత చాలమి సోకనిరీతిఁ బ్రోమనేల్
ప్రోదవు మాధవా ! కలదె పొంగుట లొంగుట నీకృపాబ్ధికిన్ ? 73

ఉ॥ నాకొమరుండు నీచలువ నన్ గనఁ గ్రమ్మర వచ్చెఁ బండిత
శ్రీకరుఁడై కృతార్థతను జెందితి నీదయకల్మి, మూఢతన్
జెకొని మొక్కులంచు నవి చెల్లుటలం చొకతంతు సల్పితిన్
లోకములెల్ల నీకడుపులోనివెగా కిటఁ గ్రొత్త లున్నవే ? 74

శా॥ నీదే నీకిడి మొక్కు తీరెనని భ్రాంతిం జెందుచున్నాఁడ నా
రా ! దుర్మోహము ! నాసమస్తమును నీయౌదార్యదత్తంబె కా
దా ! దేవా ! అగు నైనఁ దానిడిన తోయంబందు నొక్కింత గో
మ్మా ! దా ! దా !! యనుచిన్నిపుత్త్రిఁగొని నెమ్మిం దండ్రి ముద్దాడఁడే ?" 75

చ॥ అని వినుతించి, యాజ్ఞఁగొని యందఱుఁ బీటలఁ దీర్చి కూరుచుం
డినవటువుల్ సువాసినులు నిండగుపత్రము లాజ్యభోజ్యవ
స్తునికరముల్ గడున్ ముదముతోఁగొని వడ్డనఁ బూర్తిసేయ నిం
పున యజమాని తా మరలఁ బూజనొనర్చి వినీతచిత్తుఁడై. 76

క॥ "కానిం డాత్మనివేదన కానిం" డని గంటఁగొట్టి గంగకు హారిగం
గానాథుఁకును బిలిచి మహానైవేద్యంబుఁ బెట్టి యందఱు లేవన్. 7

క॥ కుసుమాక్షత లందఱ కిడి రసన మనసు కృతియు నొకట రంజిలఁ భక్తిం
గొసరుచుఁ గోయిలకూసెడుపసఁజెప్పిరి మంత్రిపుష్పభవ్యత రోక్తుల్. 78

సీ॥ వేయితలలవాఁడ! విశ్వంబునకుఁగన్ను విశ్వమే కన్నుగా వెలయువాఁడ!
భువనంబులకు హాయి పొసఁగఁజేసెడివాఁడ! భువనంబులన్ హాయిపొందువాఁడ!
సృష్టికి శాశ్వతస్థితి నొసంగెడివాఁడ! సృష్టి మించి సతంబుఁ జెలఁగువాఁడ!
జగములు జీవింప శక్తి నిచ్చెడివాఁడ! జగమె జీవనముగా జరుగువాఁడ!
కొలుచులోకంబు సేవఁ గైకొనెడువాఁడ! వలచి లోకంబులకు సేవసలుపువాఁడ!
కలిమి లేకుండి లేమిలోఁ గలుగువాఁడ! కలిమిలేముల కందనిచెలువువాఁడ! 79

క॥ నారాయణవాచ్యుఁడ! విశ్వారాధ్యుఁడ! విశ్వరూప! సాకార! నిరా
కార! నిరంజన! త్రిజగత్సాంతర్బహిరుపాసితా! విశ్వపతీ! 80

క॥ కన్నంతయు విన్నంతయు నిన్నిఖిలము నెవనికడ నొకింతయగునో సం
పన్నతఁ గళ్యాణంబుల నన్నిటఁ గళ్యాణమెవ్వఁ డానినుఁ గొలుతున్. 81

మ॥ అతఁడే బ్రహ్మ శివుండు విష్ణువను లోకాధీశ్వరుం డక్షరుం
డతఁడే మూలవిరాట్టు ధ్యేయముల నత్యంతంబు ధ్యేయుండు సు
మ్మతఁడే ధ్యానములన్ విశిష్టతమమౌ ధ్యానంబు, సత్యంబులం
దతఁడే మిక్కిలి నిత్యమై వెలయుసత్యం బంచు నిన్నెంచెదన్. 82

మ॥ వటపత్రింబునఁ బాలవెల్లినడుమన్ బాలుండవై పవ్వళిం
చుట పల్కంబడు; నట్టితావు ధర నెచ్చోనుండునో యంచు నే
గుటు మేలే? హృదయంబు సామ్యమున కాకుంబోలదే? నీవు న
చ్చటలేవే? నిదురించు నా తెలివి కాంచన్ బోల్చలేకుండినన్. 83

చ॥ తనువున నుజ్జ్రియాకుబరి దాల్చిన నాహృదయాబ్జకోశమం
దనయము దోసముల్లుకొనయంతటిరూపునఁ గోటిసూర్యదీ
ప్తిని నివసించి విద్యుదతిదీపన నాయెడలెల్ల సౌఖ్యవ
ర్తన వెలయించునీదయకు దండనమస్కృతు లోజనార్దనా! 84

గీ॥ హృదయవటపత్రసీమ శయించునీదు నాభినిర్గతకమలంబు నాదుమస్త
కంబులోనిసహస్రారకంబె గాదె మత్క్రియాబ్రహ్మ మటనుండి మలయఁగాదె.

సీ॥ ప్రాణానిలంబవై శ్వాసకోశముఁజేరి నెత్తురుక్రొవుల నిండిపఱచి
హృదయపుటంబున కేతెంచురక్తప్రవాహంబులన్ శుభ్రపఱచి సిరల
దేహాంతరంబెల్లఁ దిరిగి యన్నరసంబు నెల్లెడ సమపుష్టి నెసఁగఁజేసి
జఠరాగ్నికిని సహస్రారంబునకు నవయవములన్నిటికి సత్తువనొసంగి

యవసరము కానివాని స్వేదాదులుగను వెలికిఁ ద్రోసి సదారోగ్యకలన మాకు
సౌఖ్య మొసఁగూర్చునీప్రశస్తమగు పేర్మి దెలిసి కొనియాడఁ దరమౌనె దేవదేవ!

ఉ॥ రాజవో, చక్రవర్తివో, ధరారమణీపతివో, నవగ్రహో
త్తేజకరాజ్యదక్షుఁడవో, దిక్తతిఁ గన్పడుసర్వగోళసా
మాజకకార్యదర్శివో, సమస్తనిరంకుశశక్తిసారవి
భ్రాజిత మైననీస్థితిని బల్కెడుమాట లెఱుంగ మచ్యుతా! 87

క॥ నెల కొకపో గనుసామెత పొలుపున మే మిచ్చుమంత్రపుష్పముఁ గొని మ
మ్మల నవ్యాజకృపాగురుబలమున రక్షింపవయ్య! పరమాత్మ! హరీ! 88

క॥ అని మంత్రపుష్పమానసవినతిసమర్పణ లొనర్చి వేగఁ దదీయా
ర్చనఁ బూర్తిచేసి యాపోశనలన్ వడ్డించె విప్రసంతతి కంతన్. 89

మ॥ అతిభక్తిన్ హరిపాటఁ గొంద ఱటఁ దోడైరాఁగఁ గప్రింపుటా
రతి హస్తద్వయిఁ బట్టి చిత్తము శరీరం బూఁగి యుప్పొంగ భ్రా
లతికామధ్యగతేక్షణుండయి జగల్లావణ్యసీమా! రమా
పతి! యం చాగ్రహమేత్తి నించె భజనవ్యాసంగముల్ పంక్తులన్ 90

మ॥ సరవిన్ బ్రాహ్మణు లారగించునటు "సాజ్యం భోజ్య, మెవ్వారి కె
వ్వరి, కన్నంబిదె, కూరకూర, పులుసే పప్పా, ? వడల్ భక్ష్యముల్
పరమాన్నం" బని "చాలుఁజాలు" నని "మేల్పాకంబు" లంచున్ సుడుల్
విరివిన్ వర్తిలె మధ్యమధ్య శివగోవిందధ్వనుల్ పెల్లగన్. 91

సీ॥ వడ్డనపళ్ళెముల్ వరచక్రములుగాఁగఁ గదళీదళాగ్రముల్ ఖడ్గములుగ
సోమసూత్రంబులే సొగసుశంఖములుగా బంతులెల్లను వైజయంతులనఁగ
జిలుగుజిలేబీలు శేషశయ్యలుగాఁగ నన్నముల్ క్షీరాబ్ధిచెన్నుఁ గొల్ప
పొడుగుబజ్జీలె కౌమోదకంబులుగాఁగఁ బులిహోరరుచి పట్టుపుట్టముగను
లడ్లు భోండాలు శశిసూర్యులన్ హసింప శ్లోకగీతము లాగమస్తోకరుచిగ
నలరు నానంద మమృతవిన్యాసముగను విందు గోవిందునాకృతి విస్తరిల్లె. 92

సీ॥ వాములన్ మ్రింగెడుస్వాములకును తల్పు లప్పడాలనునట్టు "లాగు" "చాలు"
ననుట పైమాటగా కతని నీ వెఱుఁగవే కరము వెన్కనె యుంట గానరాదె?
మనసు సిగ్గు బావమాట తెల్లమెగాదె? యేకుల కే బుట్టయేపు చెడునె?
తాఁగోరి యొరుల కింతగ సిఫారసుచేయునీయయ్యకళల నీవెఱుఁగవొక్కొ
బలిమి వేసిన నాకులో నిలుచునేమి? పళ్ళెములు వాని దాఁటి యీవలకె రావె?
దృష్టియనియొక్కొ చాటఁజేసితిరి మీర? లనుచు నందందు సరసోక్తులావహిల్లె.

సీ॥ బావగా ర్నేతికి బాజారుపంపిరా! మేనమామలచాలు మానునెట్లు?
కూర వీశెఁడె తెమ్ముకొనినారుగాఁబోలు నట్టె కొసరఁబోకుఁ డయ్య వాని
నున్నచోఁ గొంచె మేయుఁడు పులిహోర తెప్పింపుఁడీ పిఁగడ పెఱుగు నింక
మాటుబింకమె గాని మండిగల్ ఫేణీలు తినలేదె? తెచ్చిచి తెలియదొక్కొ!
పాళ మెక్కువయైనచో బావగారు కొ అవికారంబు గొని సంజుకొనుఁడు కొంత
మఱఁది! గుండ్రాయి దెప్పింతుమా కుదింప నను చలోక్తులు చెలరేఁగె నందు నందు.
వ॥ అంత వడ్డించువారలలో నొకండు — 95
క॥ తినినంతయుఁ దిని యింటికిఁ గొనిపోవఁగ నేమొ వించుకొనియెన్ జెంబున్
గనుఁడంచుఁ దానె దానన్ మును వేసినకొన్ని గారెముక్కలు సూపెన్. 96
వ॥ మఱియొక్కఁడు — 97
క॥ పనియున్నట్టులఁ బంక్తికి వెనుకన్ గూర్చుండి వారివీరివమాలల్
గొనల ముడివైచి వారది కనకయ లాగికొన మిధునకంబనె నొకచోన్. 98
గీ॥ "వదినెగారిచేయి పడినదిగాఁబోలుఁ గాక పాక మింతకమ్మనగునె?"
"బావగారినోటిపస గాక నాదేమి" యనెడివరుసమాటలం దెసంగె. 99
క॥ ఈరీతి నలఁతిముదురులతో రంజిలు మేలమాటతో ముద మొలయన్
జారు ముగియించి దధ్యాహారమున నుపక్రమించి రందఱనంతన్. 100
మ॥ హరినామస్మరణంబు వంతుగొని సేయన్ బూనికన్ శంకరా
భరణం బొక్కఁడు పాడఁ దోడి నొకఁడాపన్ శుద్ధకాంభోజి నొ
క్కరుఁ డెత్తంగ వసంత మొండుదెస పొక్కన్ దేవగాంధారి మ
ల్హారి నీలాంబరు లందునం దెసఁగ నోలల్ దేర రాగాంబుధిన్. 101
సీ॥ "భైరవిపైన మాబావపోకడ మెందు వినలేదె మీ" రని పీఁగు నొకఁడు
"ధన్యాసి బిరుదంబు దాల్చునీఘనుఁ డేది కాని"మ్మనుచుఁ బ్రీతిఁ గాంచు నొకఁడు
"దర్బారు మావానిధన"మంచుఁ గనుఁగీటి పురికొల్పుఁ బ్రక్కఁ గాఁ బొడిచియొకఁడు
"మధ్యమావతికి మామఱఁదికిఁ బెనులంకె కాదోయి!" యని నవ్వు జో దొకండు
'నొక్కటునవోయి!' యన 'నేమియొక్కటనిన వేయిఁబెట్టఁడొకో' యను వేఱొకండు
హాస్యరసయుక్తగానరసాభియుక్తి దైవకీర్తన గడుహాయిఁ దనరుచుండ. 102
క॥ గలగలమనుమాటలసందుల వీణాస్వనముకంఠెఁ దొలిసన్నముగాఁ
జెలఁగి క్రమంబున నిండయి కలనాదం బొకటి ప్రౌఢగతి వర్తిల్లన్. 103
క॥ ఎక్కడిమాటక్కడనే నక్కె, గతులు చిక్కె, వడ్డనల్ నిలఁబడియెన్
జక్కనఁ జొక్కి నుడిదెస కొక్కుమ్మడి పొంగములన్నియుం దిరుగఁబడెన్.

ఉ॥ మోహనరూప మొప్ప జగముల్ దనజాలములోన ముంచి యు
త్సాహ మెసంగి జీవములచర్యలఁ గన్గొడుమంచిచెడ్డలం
దోహరిసాహరిన్ బెనఁగి యోపికడిందినవారిఁ గాచు స
న్నాహమునన్ సతం బెసఁగునాథుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్. 105

క॥ ఏమీ కంఠముమధురిమ మేమీ స్వరమొందుగుబాటు నేమీ భావ
శ్రీమాహాత్మ్యము నౌరా! సాహిత్యమె! చెవులజడ్డు జల్లించె భళీ! 106

క॥ అని యత్తులెత్తి యందఱుఁ దను నీక్షింపంగ భక్తితాత్పర్యంబుల్
ఘనగీతి ననఁగి పెనఁగఁగ మననూతనపండితుండు మఱియుంబాడెన్. 107

ఉ॥ అక్రమముల్ హరింప సుజనావళిఁ గావఁ బరాక్రమంబు ని
ర్వక్రకృపార్ద్రదృష్టియును వర్తిల నిందిరఁగూడి తార్క్ష్యుపైఁ
జక్రము శంఖముల్ గదయు శార్ఙ్గమనుఁ జేతులఁ దాల్చి నాదనా
మక్రియ నెందుఁదోఁచుపగమప్రభు విందుఁ బ్రసన్నుఁడయ్యెడున్. 108

క॥ 'తక్రోపక్రమసమయే చక్రధరస్మరణ' మనిన సంగీతకళా
విక్రాంతి వివశులగుటన్ బ్రక్రమముల్ మఱచి రెల్లవా రాయదనన్. 109

క॥ గోవిందా యన నేమఱి యానందున నెల్ల రతని నరయుచునుండన్
రేవిం దనకృతి గానముప్రావీణ్యము గంగ యమునవలెఁ బ్రవహింపన్. 110

సీ॥ ఆభోగిభోగపర్యంకంబునన్ హాయి నూగుచు జగమేలుహాయటుకాఁడ !
మధుముఖారిక్రూరమదనివారణఁజేసి మేదిని గల్పించుమేటిప్రోడ !
సకలభూపాలక సంస్థానముల నొంపఁ బెంపఁగాఁ జాలిన పెద్దఱేఁడ !
శ్రితచక్రవాకనిశ్రేయసాధానభాస్కరమూర్తివై ప్రేమ గఱపువాఁడ !
శ్రీమహాదేవి యురమునఁ జెలఁగువాఁడ ! కన్నడ నొకింతయెఱుఁగనికన్నవాఁడ !
పూర్ణచంద్రభద్రముఁగాచిప్రోచువాఁడ! మహితహంసధ్వనిన్ గొల్పుమంత్రగాఁడ!

క॥ "జయజయ"యనఁగా నందఱు స్మయవిరహితులై ద్రుతోక్తి జయగోవిందా
"జయజయ" యనునప్పుడు నిశ్చయముగ హరి దోఁచినంత సంతస మెసఁగెన్.

గీ॥ భోజనంబులు ముగియఁ దాంబూలచర్వణంబు లొనరించి నాఁటిసన్నాహమంత
యును జయప్రదముగ సహాయులయి యెవరి యింటికిని వార లానాఁటి కేగినంత.

ఉ॥ ఎంతటివాఁడు కావలయు నింతజయంబు మఱింతకీర్తి యిం
తంతటి మేల్ప్రశస్తి యనయంబును గల్గుచునుండె గర్వవి
భ్రాంతి మనంగ కేఁడుటకు, బాలుఁడు సౌమ్యుఁడెయైన లోన నొ
క్కింతపరాకు లే దనుట యెంతయు దవ్వగు సత్యదృష్టికిన్. 114

ఉ॥ బాలసఖుండు దనుం దరియుపట్టునఁ దొల్లిటికల్పకోలుబం
డాలము, మేలిచూపుపస, దగ్గతి యొండొరు గ్రుచ్చికౌఁగిలిం
డేలి కరంబు లంసముల నిల్పి యనంగి పెనంగుమైత్రితోఁ
గ్రాలుట లేదు, రాధయును బ్రౌఢతఁజెందిన కృష్ణు నట్లుగన్. 115

సీ॥ పల్కరింపఁగ ముఖభావముఁ జూపునేగాని మనసిచ్చి మాటాడుచనవులేదు
"ఏమోయి" యని సఖుం డెదురై కరము సాపఁ జూచిచూడనియట్లునురిగియేగు
పెనుసంతసంబు మోమున నిండ నేతెంచుతమికాఁడు తనుజేరుతటి యిడండు
తప్పనిసరియైనతావులన్ గొట్టువాక్యములఁ జిన్నంబుచ్చి యవలికరుగు,
సఖులు గుమికూడి "యేమిరో! చాలమారె నయ్యవదవడి విద్యయు నందుఘనత
తెలుగాఁబోలు కనుల" కం చుఱక బెగడ వీరిమాటేని గొనఁడు నవీనసూరి. 116

—♦ భారవి - అవధానము ♦—

ఉ॥ ఆమఱునాఁడు బాలునిమహోన్నత వెల్లడిసేయఁ దండ్రియున్
మామయు నిశ్చయించి మునిమాపున నందఱఁజేర్చి పృచ్ఛకుల్
గా మతికొందఱన్ నిలిపి కన్గొనవచ్చిన స్త్రీలు శూద్రులున్
సేమముగాఁ గనన్ వినఁగఁజేసిరి వీ ళ్ళిరువంకఁ దత్సభన్. 117

గీ॥ అట్టు లచ్చోట నంద ఱర్హాసనములఁ జేఱఁగా మామయుం దండ్రి చెంతలందు
నెసఁగి "కాని"మ్మనఁగ వారి కెఱగి లేచి మోడ్పుగే ల్ఫాలమునకెత్తి మునుగడంగి.

సీ॥ సన్నాహముల మించుశక్తిన్ బ్రసాదించుసర్వశక్తునకు నంజలిఘటింతు
ఘనమైననిజతత్త్వమును దయన్నుడులలో నొదిగించుకొనువాని మదిఁదలంతు
త్రిభువనాలంకారదీప్తియయ్యును గళాలంకారముల నిల్చులలితు నెంతు
నధికతరవ్యాప్తి నలరుచుండియు భక్తులన్బ్రోచువాని లీలన్ స్మరింతు

గీ॥ తల్లిదండ్రియుగురుఁడునాత్మజుఁడుహితుఁడు మొదలుగాఁగలసంబంధములఁజరించి
సంతతప్రేమ సుధ వెదఁజల్లుచుండు పరమదేవుఁ జిదానందుఁ బ్రస్తుతింతు. 119

చ॥ హరికి జొహారు శంకరున కంజలి నల్వకు మ్రొక్కు లక్ష్మికిన్
శిరము గిరీంద్రపుత్రికిని సన్నతి వాణికి మోడ్పుగే ల్గణే
శ్వరునకు దండముల్ మఱిసుపర్వుల కెల్ల నమస్కృతుల్ పరం
బరినుతి దేవమర్త్యకవిపర్యుల కార్యవిమర్శకాళికిన్. 120

క॥ శ్రీలన్ జెలువయి బహుళరసాలంబనఁ దేలుకమలజాండంబున ర
మ్యాలాపరుచిరకేళీవ్యాలోలత వెలయుతత్త్వ మర్చింతు మదిన్. 121

గీ॥ వివిధభాషారసార్ద్రకవిత్వతత్త్వసముదయప్రోద్భవోద్ధానకాలిందీప్ర
భావవాగర్ణవాధిదైవతకళాప్రవాహకవితాసరస్వతిఁ బ్రస్తుతింతు. 122

క॥ ఊహాప్రపంచనిభృతోత్సాహావధానలేశసంభవదఖిల
వ్యాహారదోషసమ్యగ్గ్రాహివిమర్శకవదాన్యకలన నుతింతున్. 123

మ॥ తనరెన్ సంస్కృతప్రాకృతాంధ్రకవితాధారాసుధారాశి, క్షీ
రనిధిన్ గౌస్తుభచంద్రముఖ్యపరివారప్రాప్తికిన్ మించి నూ
తనకావ్యామృతసత్కళాకలితరత్నశ్రేష్ఠమై యేకవీం
ద్రనికాయంబు, వినమ్రతన్ నతులు తద్గ్రంథాళికిన్ దాకినన్. 124

ఆ॥ పాలకడలిలోనిహాలాహలంబైన మ్రింగఁబడదె శశికిరీటికలన
కావ్యజలధి దుష్టకవులనిశ్వాసముల్ సమసిపోవె రసికజనము మ్రోల. 125

గీ॥ అనుచు నుపవిష్టుఁడైన రామావధాని యొకఁడు తొలిప్రచ్ఛకుండయి యోయి! భక్తి
యెట్లు వెలసిన వెలయించు నెఱుఁగఁ జెపుమ యుత్పలంబున "డ"ప్రాస నొక్కమాల.

వ॥ అనిన నవధరింపుమని — 127

ఉ॥ పాడి యొకండు, పాడఁదగుపాటల వ్రాసి యొకండు, వ్రాయఁగాఁ
బాడఁగఁజాలి యొక్కరుఁడు, వ్రాఁతకుఁ బాటకుఁ గూర్చుతాండవం
బాడి యొకండు, పాటకును నాటకు నేర్చి మఱొక్కఁ, డాటకుం
గూడినవ్రాఁత కింకొకఁడు, కొల్లఁగ వ్రాయఁగఁ బాడ నాడఁ జే 128
కూడినయొక్కఁ డిట్టు లోనఁగూడియు నస్ఖలితోరుభక్తి పెన్
జాడ నెసంగకున్న సరసంబులె వ్రాఁతలు పాట లాటలున్
పాడుట నేనె దిట్టనని వ్రాయుట నే మొనగాఁడ నంచుఁ జిం
దాడఁగ నేనె నేర్తునని యాటలఁ బాటల వ్రాఁతలందు నే 129
నోడుట కల్గదంచుఁ దనయొప్పితరు ల్గడియింత్రొ లేదొ యం
చాడను నీడ నిక్క కడునాతురతన్ గనుఁగొంచు గర్వపున్
దాడులఁజిక్కి, భక్తి పెడదారుల ద్రిక్క గుణించుచుండు నె
వ్వాఁడును ముక్తిబాటఁ గనవచ్చునె? కాలముఁ బుచ్చుమాత్రకే 130
వీడునె పాపపంకములు? విచ్చునకత్తులబోనునాఁగఁ బై
మూడినకామముఖ్యబలముల్ చెడి కూలి నశింపఁబోవునే?
వేడుకపాటలన్ జెడుగువేడబముల్ మసిచేసిదైవమున్
జాడతెలుంగఁగోరి, యఘసంచయముల్ చెడఁగోరి, పుట్టువుల్ 131

పీడుటఁగోరి, స్వర్గము లభించుటఁగోరిన దైవకీర్తనన్
గూడఁదగున్ దమాష యనుకోక గడుంగడుశ్రద్ధ పెంపునన్
జూడఁదగున్ దిరికూటమున, జుమ్మని మూఁగెడుసౌఖ్యయోజనల్
వీడఁదగున్ క్షణంబు నిలలేనిమనంబును బట్టికట్టి జా 132
పాడఁదగున్ గృతు లన్నడులు వాంఛలు నేకముఖంబుగా నహం
బోడఁదగున్ మహాజడత నూరక ఫ్రూడి కృశించుజ్ఞానమున్
దోడఁదగున్ మదిన్ దలఁచుతోడనె మైఁబులక ల్దళింబులై
గాడఁగ నర్చ్యదైవతము గాఢమనంబున నిల్పఁగాఁదగున్; 133
వాడనిభక్తి చిత్తము నవశ్యతఁజేర్పఁదగున్; భజింపఁగాఁ
దో డతిముఖ్యమా? మదిని దోఁచుమహాత్ముఁడె తోడు గాఁడె, లో
నాడులనుండి గానకలన్ ముద మాతఁడు నొందుచుండఁడే
నీడగ నెప్పుడున్ విడక నిత్యము నీమదిఁ గూడియుండఁడే 134
వాడియొసంగుభక్తి కలవాటయి, దాని ననుక్షణంబునున్
వాడుక సేయుచున్ గొలుచువాఁడు గడించు నఖండతుష్టి మే
ల్వోడిమి హాయి పెంపుఁ గనఁబోఁ డితరుం డిది నిశ్చయంబు, వె
న్నాడినపాపము ల్దొలఁగు నద్యతనాఘము లుండఁబోవు ముం 135
దేడనొ పుట్టి పొందఁదగు నెంతటిశేషము నేని చిక్కకే
పాడటి బ్రింగు - భక్తి సులభంబని యేమఱరాదుసుమ్మ-పె
ల్లాడిక గల్గుచోట నపహాస్యము పైకొనుచోట సౌఖ్యతన్
నాడెము డిందుచోట జతనంబులు వ్యర్థము లైనచోటులన్ 136
బాడి నశించుచోట బహుభంగుల నాపద లూపుచోటులన్
దాడన లబ్బుచోట నుతితాత్రిడు బిగించెడుచోట దూఱపిం
డీడుచుచోట బుద్ధి చలియించు, మనంబు కలంగి లొంగుఁ దెం
ఫ్రూడు, బలంబు సగ్గు ధృతి యూడనిబాడు శిరంబు దిమ్మనన్ 137
గోడున మున్గ టిచ్చవడి కూలి కుమారిలు నట్టిలౌను వే
యేడులు నిండినట్లగుచు నేడుపుసోకెడు నై దుప్రాణముల్
గూడుల వీడి మేను దొలఁగున్ బెనుపాశము ఫ్రాన్చికట్టి నా
వాఁడని వచ్చి జాలిఁగొని పాపవిముక్తు నొనర్ప నెవ్వఁడున్ 138
రాఁడు తృణీకరించును జిరాకుగొనున్ నగు నీసడించు నెం
జేడుగ డాపరాత్పరుఁడె యింకెదియున్ జెడునన్న రూఢితోఁ

పాడుటె పాట, తత్పరతఁ బాయక తద్గతచిత్తవృత్తితో
నాడుటె యాట, యిట్టివిషయంబును దేటతెనుంగుగా నొరల్ 139
వాడఁగ యోగ్యమైనదియె వ్రాఁత తదన్యము త్యాజ్యమేసుమీ !
కూడఁగఁబోలుఁ గోర్కెల దిగుల్ పడకుండుమనంబుతోడ నీ
వాఁడను నాకు నీవె భగవంతుఁడ వన్య మెఱుంగనంచునున్
బాడఁగఁబోలు సుమ్మవితథమ్మనునట్లు మృదంగతాళముల్ 140
జోడుగ మ్రోయఁగావలయుఁజుమ్మ, రసోత్కలికానుసారతన్
గాడినపెంపుమైఁ బెనుపఁగాఁ దగు నాట్యమొనర్పఁబోలు, నో
బాడబపద్మమిత్రహిమభానుకృతాక్ష ! జగన్నివాసకా !
యీడితసంశ్రితావనశుభేక్షణ ! నాయిహవర్తనంబునన్ 141
గూడమి రానటుల్ బలము గొల్పుము నీపరిచర్య యందు నే
వాడలనేఁ జరించినను వర్తిలనిమ్మని వేడ ముక్తి యే
జాడనొ డాగునే కడువశంబయి హస్తగతంబ యయ్యెడున్
జూడుఁడు ప్రశ్నకున్ దగినచొప్పున నుత్తర మీవిధంబకో. 142

క॥ అంతటఁ గరతాళంబుల సంతసమున్ జనము దెల్పుసద్దడఁగంగా
నంతేవాసిని గాంచి తదంతికగతుఁడైనమామ యనె నీరీతిన్. 143

ఉ॥ అల్లుఁడ ! తెల్వి నీ వచటునచ్చట నందినగెల్పు గెల్పుగా
దెల్ల తెఱుంగుమా పెగద యింటను గెల్చిన యచ్చగెల్పునాఁ
జెల్లెడుసామెతన్ మిగులఁజిక్కులుగల్గఁ బరీక్ష నేఁడు సం
ధిల్లనొనర్చినాఁడ మది నిండినమెల్పున గెల్పు నొందుమా ! 144

వ॥ అనిన మామతో — 145

ఉ॥ పెద్దలు వీరు, నన్ను గని పెంచినతల్లియుఁ దండ్రి వీరు మే
ల్విద్దె నొసంగి వన్నెటులఁ బెద్ద నొనర్చినమీరు సత్కృపన్
వాద్దిడి దీవనల్ గొలుప నాబలమే ననుఁ గెల్వఁజేయదే
యెద్దరినేని నాతెలివి యిట్టటు గుంటున సంభ్రమించినన్. 146

వ॥ అని యల్లుండు వినయవినమితోత్తమాంగుండై సభాస్తారులకు, జననీజనకులకు, తనగురుం డైనమామకు మోడ్పుఁగే ల్సాపి బదులొసంగిన సంతసించి యతని విద్యాసామర్థ్యంబు నేఁడు తనసకలబంధుజాలంబు నెఱుంగునవసరంబు గల్గుట కాత్మ యుప్పొంగుచుండ నక్కాశీపండితుండు వ్యస్తాక్షరికి రామావధానిని నిషిద్ధాక్షరికిఁ దానును గంటు మ్రోగించుటకు రంగావధానిని బువ్వులం జల్ల జగు

దీక్షితులను సమస్యనొసంగఁ బట్టాభిరామశాస్త్రిని, కల్పనకు రాయప్ప సోమ
యాజిని జదరంగంబునకు నారాయణరావును, బురాణంబునకు సీతారామశాస్త్రిని,
యప్రస్తుతప్రశంసకుఁ బరదేశిసోమయాజులను సమర్థస్థలంబుల విడియించి
వ్యూహంబున కంతకుఁ దాన యాచార్యుండై మోహరించి చేయూపినతోడనే.

రామావధాని

గీ॥ వటువ "'రిథతస్థకైకుహోపాలు రెండు నేను పది పదే న్బదునెన్మి దిర్వదొకటి
యిర్వదా రిర్వదేడులై యొసఁగుఁ గనుము యింతవఱ"కనివ్యస్తంబు తెలుఁగఁజేయు.

ఉ॥ ధారణ వాని నిల్పుచుఁ బదంపడి మామను బిల్చి "శిర" యం
చారయ "మా" వివర్జ్య మనునంత "తఁ" జెప్పిన "గా" ను వీడునాఁ
గారయమెుప్ప "షా" పలుక గ్రక్కునఁ దొల్తటిపాద మిట్టులే
పూరణసేయ గంట లిఱుమూడు వినంబడె ఘట్టనార్భటిన్. 149

గీ॥ ఆమెయిఁ గడంగి గంట రంగావధాని గొట్టఁగా జగ్గుదీక్షితు ల్గుసుమములను
వెంట నేడింటి వేసెను వీఁపుపైనఁ దివిరి పట్టాభిరామశాస్త్రివరుఁ డంత 150

క॥ "వచ్చెను నావం తిదిగో యిచ్చెదను సమస్య దాని హితపూర్ణతకున్.
దెచ్చితివయేని సురగురు మెచ్చెడుగతిగాఁగ నిన్ను మెచ్చన్ వచ్చున్. 151

వ॥ కొనుమని "చిక్కులఁబెట్టఁబోకుము నుతించెద నోకవితాసరస్వతీ !" యను సమస్య నెసకొల్పిన వెంటనే వ్రాసికొనుఁడని "గ్రక్కునఁగైతఁజెప్పుటకుఁగా మదిఁగోరి యశిక్షితుం డొకం"డని వచించి యొగుప రాయప్ప సోమయాజిం బరికింప నాతం 'డోయీ ! పద్మగంధ మానుబంభరసంచారమునకును, బరబలప్రాణాపహారిణి యగుబాణగమనమునకును సామ్యముం గల్పించి హితునితో నొకఁడు పల్కినట్లు మత్తేభంబున వచియింపు' మనఁ జిత్తము లిఖించుకొనుఁడని "అలవోకన్ విలువీడి తీవ్రగతి గమ్యస్థానలగ్నంబులై" యనునంతవఱకుం బల్కి "యేమి ! నారాయణరావుగారూ ! మంత్రిని బాగుగా గ్రమ్మికొనినారు గాని రాజునకుఁదెఱవదొరికిన దిదే యేనుంగున "షహా" తప్పించుకొని యావలిశకటును బలియొసంగుఁడని సీతారామశాస్త్రి నవలోకింప నతండు 152

"సింగం బొంకటితో గుహాంతరమునన్ జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చెనో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్."

వ॥ అనుపద్యముం జదివి పద్యసరళిం బురాణింపుమనిన వినుండని. 153

ఉ॥ ఓరుపులేక యీసున సుయోధనుఁ డట్లు దురోదరంబునన్
శూరులఁ బాండుభూసుతులఁ జుల్కఁగ నోడఁగఁజేసి పందెపున్
దీరుపువెంట వారి నతిదీనులఁగా నొనరించి పంపినన్
వారును ద్వాదశాబ్దము లపారవనంబుల నిల్చి పిమ్మటన్. 154

క॥ ఏఁడాదిమితిని నెవరన్ జూడఁ దెలియరానిదాఁపు చొప్పడ విరటున్
గూడి యొకింత కొలఁగ నాయేఁడున్ గడపుకొనుచుండ నిది చూచాయన్. 155

ఉ॥ కౌరవనాయకుం డెఱిఁగి గ్రక్కున వారిని బోల్చి క్రమ్మఱన్
మీరు త్రయోదశాబ్దములు మీవచనంబుమితిన్ వనంబులం
దూరుల నిల్వఁబొం డనుచు నొత్తి వచింపఁదలంచి దాడిమైఁ
జేరి విరాటుగోవులను జెచ్చెఱఁబట్టెను రెండుదిక్కులన్. 156

ఉ॥ దక్షిణమందు గోవులను దార్కొనవచ్చు సుశర్మఁ దోల మ
త్స్యక్షితినాథుఁ డుత్తరబృహన్నలలున్ మినహాబలంబులన్
దక్షతఁ గొంచుఁబోవఁగ నుదగ్దిశఁ గౌరవసైన్యమెల్లఁ బ్రి
త్యక్షముగాఁగ నుత్తరబృహన్నల లద్దెస యుద్ధకాంక్షులన్. 157

క॥ రథి యుత్తరుండు చోదనకథకు బృహన్నలయుఁ గాఁగఁ గడువేగమునన్
రథ మేగుచుండఁగా నా పథమున నల్లంత సైన్యపటలము దోఁపన్. 158

క॥ గ్రుచ్చెద నారాచంబుల వ్రచ్చెద బలములను బతుల వడిఁ బశువితతిన్
దెచ్చెదనని పెక్కాడియు బిచ్చవడియె నుత్తరుండు ధృతిపెం పడఁగన్. 159

శా॥ అమ్మో! సేనలటన్న నేయలఁతులో యనొక్కంటిఁగా కిమ్మెయిన్
దుమ్ముల్ప్రెమ్మెడుమ్రోఁత “భో” మ్మనుచు వార్ధుల్ పొంగియేతెంచు చం
దమ్మైనన్ దెగ నేనుగాదు వటి నాతాతైన దమ్మున్మను నే
పొ మ్మీపాటికిఁ జాలు నీతెగువ నావుల్ గీవు లింకేటికిన్. 160

చ॥ అనుచు బృహన్నలన్ బలుక నాతఁడుఁ దా వినిపించుకోఁక స్యం
దనగమనంబు నింక నదనంబొనరించుచు మందహాసదీ
పనగను మోముఁద్రిప్పి తగవా! నగరా? నగరేగి భీతిపెం
పున నిటుపాఱినామనిన బుద్ధులుగన్ ముసళుల్ పొరింబొరిన్. 161

ఉ॥ రాజసుతుండ వీవు వటి రాజసగర్వ మెలంగి రాజవి
భ్రాజితబాహుశౌర్యపటుభంగుల నేర్చితి నేనుఁ గొంత నీ
తేజము నీ వెఱుంగ వొకదెబ్బకుఁ గూల్పవె పెక్కుమాకలన్
మోజు దొఱంగకయ్య మనముందటు సేనలు గీన లాఁగునే? 162

క॥ సాహసఁ గనుఁగొనుకోరిక నీపగిదిం బలికి తనుచు నెంచెద విను మో
భూపసుత! నీవు మెచ్చఁగ నేపున నడిపింతు రథము నెవ రెదురైనన్. 163
క॥ ఈవాక్యములకు నుత్తరుఁ డావఁ దినినయట్లు దేహ మాపాదశిరం
బీవసుధయెల్లఁ దలక్రిం దైవడుగతి బమ్మరిల్లి దడ మెయి వడఁకన్. 164
ఉ॥ చెమ్మట గ్రమ్మఁ గూలఁబడి చేఱగిలఁబడి సొమ్మపోయి న
ట్లెమ్మెయినుండి కొంతపడి కాతఁడు తెప్పిటి యెంతఁ జూడ్కిఁ దు
గ్రమ్మగఁ బొర్లునన్ నడచుకౌరవసేనలు వ్రాల నీతఁ డిం
కెమ్మెయిఁ దేరు ద్రిప్పఁడని యేపతి యుత్తరుఁ డొక్కదూఁకునన్. 165
వ॥ అరదమునుండి క్రిందఁబడి యావడి ముమ్మఱు దొర్లిపొర్లి మే
న రజము సోక దుబ్బటయినన్ మదినెంచక తొట్రుపాటుతో
నొరగుచు లేచుచున్ వెనుక కొక్కమొగిన్ బరువెత్తునుత్తరున్
సరభసవృత్తిఁ గూడఁజని శక్తి బృహన్నల నిల్వరించుచున్. 166
మ॥ పరవన్ జారినపైఁట నొక్కకయి నొప్పన్ దిద్ది యొక్కంట ను
త్తరుఁ బోనీయక నిల్పిపట్టి ముఖపద్మంబందుఁ గోపంబు రో
త రుషావైఖరి యొప్ప పేడికడ నీదార్ఢ్యంబునన్ రాజసం
పురయంబుం గని మాత్స్యుఁ డాత్మ వెఱత్రోపున్ సంభ్రమంబున్ గనన్. 167
ఉ॥ పుట్టువ బుగ్గిగాఁగ మగపోడిమి మండఁగఁ బేరు పెన్నలో
గట్టనఁజేర సిగ్గు చెడఁగా నిటు పాఱెదె? పాఱఁబోతుఁ జే
పట్టుదు రొక్కొ! తిట్లు దిగపాఱఁగ బోయరె యాఁడువారె? నీ
యట్టివివేకు లిట్లు గుదురయ్య! ధృతింగొను రాజనందనా! 168
చ॥ జడుపున నేఁడు పాఱి యిల సాగిననాళ్ళు శిరంబు నెత్తి యె
క్కఁడవు గృహంబు వీడి చనఁగాని నికృష్టపుజీవ ముండినన్
మడిసిన నేమి? పౌరుషము నల్వురెఱుంగఁగ శత్రుఁ దాఁకి పెం
పడఁచిన నిందుఁ గీర్తి, పడినంత దివిన్ సుఖ మబ్బు నుత్తరా! 169
చ॥ నిలువుము నిబ్బరంబుగ, జనించిన నివ్వెరపాటు మాను, చూ
పుల వెనువెట్టి డింపు, మతి ముచ్చట నీచెలియల్ వరించు గు
డ్డలఁ గొన నుత్సహింపుము కడంగుము రమ్ము రథంబుపైకి, యెం
దుల నెం ఁరండసట్టివిపుత్రుం నిసఁ నెందుకు లెమ్ము లెమ్మనన్. 170
మ॥ ఎదుటన్ దోఁచుప్రచండవాహినిఁ గనన్ హృత్పీఠి వ్రయ్యన్ బిరిం
డి డెసన్ బోవఁగనీని పేడి మెయి నుద్దీపించుదార్ఢ్యంపు సం

పదఁ దప్పించుకొనఁగలేమిని భయోత్పాతంబు నెందైన నె
య్యదియుం దోషమి నాబృహన్నలకు సాష్టాంగంబుగా వ్రాలుచున్. 171

పరదేశి. గీ॥ ఆపు మోపిల్లవాఁడ! రసాభియుక్తిదొఱఁగు నీదు పురాణవాగ్ధోరణులకు
యేటివఱదను గడువడి దాఁటుచొప్పకట్టులన మామనంబు లెక్కడికో పోయె.

క॥ అప్రస్తుతప్రశంసకు నైప్రాధ్యింపంగఁబడి సమర్థతఁ దగునే
నే ప్రస్తుత మేమతితి మహాప్రస్థానం బొనర్చె నాహా ప్రజ్ఞల్. 173

క॥ అయినన్ గవితాలోకము నెంబది మంచిచెడ్డ లెల్ల నెఱిఁగించు విమ
ర్శయుఁ జైతయు నెట్టివి నిర్ణయ మెయ్యదియొక్కొ కవిపరామర్శకులన్. 174

మానిని॥ చంపకప్రసూనమాల సాగి రూఢిఁబల్కు మా
లింపఁ బ్రాస "సా" పదావళిన్ నిదర్శకంబుగా
జంపులేని యాశుధారశక్తి విస్తరింపుమా
పెంపునూత మేవిధంబొ భీతిఁగొన్న నాపుమా. 175

క॥ అనుపలుకులఁ జలింపక మనఉత్సాహంబుమీఱ మాణవకుం డి
ట్లను మీరు వినువకుండఁగ వినఁబూనిన నెంతయైన వినుపఁగలుగుదున్. 176

చ॥ పసినిసుఁ గొక్కురండు తడబాటుగ ముద్దులమాటలాడుచో
ముసిముసినవ్వులూరఁ బలుపోకల మోదము గుబ్బతిల్లు నే
విసుఁగు జనింప దింకఁబయి పెచ్చు తదర్భకుఁజేరి యెన్నియో
కొసరులఁ దన్ని సర్గపదకోమలమాధురిఁ గ్రోలఁజేయు నే 177
పసగుణమో యెఱింగి నుడిఁబల్క నసాధ్యము; భావబన్ధి బ
హ్మసపి నెఱుంగుచో ననుభవైకసుగమ్యముగాఁగఁబో ల్కళీ!
తొసఁగులపుట్ట గాక శిశుధోరణి శాబ్దికసౌష్ఠవంబు స
ద్రసబలపోషణంబు, సుకథానకవృద్ధి, కళాసమృద్ధి, పా 178
త్రసమయసిద్ధి, యౌచితి, ముదం బిడుశుద్ధి యొసంగునే? తదీ
యసముపపత్తిఁ గాంచనెకదా! తలిదండ్రులు వానిసద్గురు
ప్రసితు నొనర్చి వాక్యగుణపద్ధతులందు ననుక్షణంబుగా
నెసఁగుననేకదోషముల నెత్తి, విమర్శయొనర్చి, చూపి స 179
ద్రసనుని జేసికొందురు. తదంచితగౌరవ, మాత్మసౌఖ్యముక్
స్వసమితి ధార్మికాగ్రతఁ బ్రపంచనిరామయతత్వవృద్ధికిన్
వసతి నెలంగుమార్గమని, ప్రాత్యులు, మూఢులు, సోమరుల్ దదీ
యసుఖశుభాప్తికిఁ వలయునంతటియోపిక లేక, స్వేచ్ఛకున్ 180

ముసురుమునుం గటంచుఁ, దమపుత్త్రులు ఛాందసదేశికాళితో
ననపడలే రటంచు, జననప్రభృతిన్ దమచుట్టుఁ దోఁచు వా
గ్విసరము లూహకుం దగులువేషము లాటలు పాట లెన్నియో
వెసఁ గనుఁగొన్నమాత్రఁ, దనవీనులతో వినినంతమాత్ర, దీ 181
మసము మెయిన్ దనంతటఁ గ్రమంబుగ బాలుఁడు నేర్చుచుండఁ, బె
న్గసరుల, మందలింపుల, వికారపుబెత్తపువ్రేట్లఁ, బోట్ల, రా
క్షసులకునైనఁ దోఁపని పిశాచపుశిక్షలతోడ బిట్టు దా
నుసికొలుపన్ దలంచినయయోమయదేశికమార్గ మన్నిమా 182
నసముల కెక్కునా యన కనార్యపుటధ్యయనంబుగూర్చు దు
ర్వ్యసనులస్వార్థవృత్తులకు నొడిపుచ్చఁగనేల, వెన్నకున్
మిసిమి నొసంగుమార్దవత మించి, శిరీషసుమాతిపేశలా
గ్రసరతఁ బొల్చుబాలకునిరమ్యతరం బగుబుద్ధి నంచు నే 183
యసదుకవిత్వవల్లరియొ యల్లి, యపోహల బిడ్డలందు బి
ట్టెసఁగఁగఁజేసి, శిక్షపయి నేవము, సద్గురుబోధమీఁదఁ బె
న్గసి యుదయింపఁజేసి, ఘనకార్య మొనర్చినయట్లు వ్యర్థతా
మసమున విఱ్ఱవీగుదురు, మంచినొనర్చునె సంఘమందు నీ 184
మసనపుకాఱుమబ్బులదుమారము, తిత్తిరిగాండ్ర తీండ్ర లు
క్కసపుదడాదుడుల్ ? చెడుగుకేవ్రలబిడ్డలఁ ద్రిప్పి వారి నీ
రసగుణులన్, గుయుక్తికుల, భ్రష్టవివేకుల, నాతతాయులన్
వసమఱుగాండ్రఁజేయు, గుణవంతులు దీనిని మెచ్చుకొందురే ! 185
మసి గసి మూఁగి, పెన్గనుల మల్లటునాడి, మడంగు హేమపు
న్నుసి వెసమూసలన్ దివిచి నూరులమార్లు పుటంబువెట్టి కు
ప్పసపసలున్ వదల్చి, బహుభంగుల ఆపిడి సానఁదేర్చి మే
లిమి సలుపుకొన్నఁగాదె యవలీల ననర్ఘ్యవిభూష లెన్నియో 186
పొసగులఁ జేయుపీ లమరుఁ; దేఁకువ నూఁకను నూఁక చిట్టు బొ
ట్టినుమును మున్నుఁగాఁ జెరిగి, యేర్చి, జలంబులఁ దార్చి, మూడు మా
ర్లసిమి, గ్రహించి, పాళమయి యొప్పసెగన్ బచనంబొనర్చి, స
ద్రసపహితంబు, నాఖ్యరుచిరంబు, పయఃఫలసంభృతంబుగా 187
మెసవినఁగాక మేల్పవుల మేకొనఁజేయునె బియ్యపోగిరం ?
బుసులని, యేదియో ఘనత యొప్పునటంచు భ్రమప్రమాదమా

నసమున వెఱ్ఱితొఱ్ఱివచనంబులఁ బల్కుదు రింతెకాక బా
ల్యసమయచేష్టితంబుల సలక్ష్యముగాఁ బరికింప బాలకుల్ 188
స్వసుఖ మెఱింగి స్వాపకృతి పొల్పడకుంట, స్వభావమై కనం
బొసఁగు నె? దేనిఁజూచినను "భో" రన హస్తయుగంబు సాచి, త
ద్గ్రసనమునన్ బెనంగుట స్వకం బగు నైజముగాఁగఁ దోఁపదే?
యొసలిక నిల్చి, తీన సుఖమేర్పడుఁ, గష్టము దీఱఁ దోఁచునన్ 189
వ్యసనము గల్గునందనుక నాగుదురే పసిపిల్ల లెంచ? న
ద్దెసఁ దలిదండ్రులో యొరులో తీఱనిశ్రద్ధఁ జరించి వారికిన్
దొసఁ గిడునగ్ని, దీపశిఖ, తోయము మున్నగువస్తుసంఘముల్
వెసఁ దొలఁగించి, వానియెడ భీతి జనింపఁగఁజేయ రోటు? సం 190
తస మిగురొత్త, బిడ్డలకు "నాన్న"యు "నత్త"యు"నమ్మ"యంచు"గా
య"నెగ" యటంచు మాటల నిరంతర మెన్నియొమార్లు చెప్పకే
కొసరి వచింపఁ జేయకయ కోవిదు లౌదురె వారు? సంతతా
భ్యసనము దిద్దుబాటు నిటు లాజననంబు నెసంగుచుంట నే 191
సిసువులు లౌకికార్థికవిశిష్టకళల్ గ్రహియించి సంస్కృతిన్
పసిగ మెలంగఁజాలుదురు, శంకలు జాఱుడుపాట్లు పండిత
శ్వసనములందె మెండుగ నెసంగుననన్ బెఱమాటలేల? కా
ర్యసముదయంబులం దనుభవాప్తియు శిక్షయుఁ దోడుగాఁగ బు 192
ద్ధిసునిశితత్వ మేర్పడ నతీంద్రియభౌతికపారలౌకిక
ప్రసరముహుర్ముహుర్వ్యళితరాజ్యమహార్ణవవీచికాంతరం
గసకలపాలనక్రియ, నఖండితమంత్రినియుక్తయంత్రిభా
గ్యసహితధీబలోగ్రసలిలాంతరయానము లైనపాండితీ 193
లసితసమర్థకల్పితకలాపములందె, దొసంగు లెన్నియో
పొసఁగుటఁ, దత్ప్రమాదములఁ బోల్చి, మహాజనచారిపత్రికా
రసనకుఁ దార్చి, ఖండనపరంపర లొప్ప, విమర్శఁజేయుటల్
బిస నెవఁడో యొకానొకవివేకవిహీనుఁడు తప్ప రాజ్యపుం 194
బస వసుధాస్థలిన్ బ్రబలఁబారినదాదిగ సర్వచక్రవ
ర్తిసమితి మాఱువేసములఁ దిర్గి స్వపాలితమానవౌఘమం
దసహానవృత్తి యేర్పడియెనా తమపైనని, యాత్మరాజ్య కా
ర్యసమయముల్ ప్రజాసుఖదురత్యయవృత్తికిఁ దప్పెనా యటం 195

చనకృదుపాయయోగముల నారసి వెంబనె తత్ప్రియుక్తముల్
మసలిచికొంటయున్ జదువమా! వినమా! కనమా! చరిత్రలన్
దెసలను నాఁడు నేఁడు జగతిన్ దినమున్ బ్రభవించువార్తలన్ ?
మసకలమారిసృష్టిని విమర్శను గోరనికార్య ముండునే ? 196
యునులున స్వేచ్ఛయున్ మరఁగి, యొప్ప నెఱుంగనివారి కెప్పుడున్
విస మగు సద్విమర్శ, పదివేవురు తప్పనఁ గాదటంచు వె
క్కసముగఁ బల్కుచుందు రతిగర్వపరాభవ మందుదాఁకఁ దా
మసమున నంధులై యొకరు మాకవనంబులఁ దప్పువట్టుధై 197
ర్యసహితు లుందురేయని నిరంతరగర్వనికృత్తచిత్తులై
మసలుదు రవ్వలన్ బ్రతిభమాలి గతోత్సుకతన్ జరంతురు ముం
దసదవివేకమేల వెను కావెగటున్ వెనుబాటు నేటికో ?. 198

వ॥ తెలిపి దొరికెఁగదా యని రామావధాని యుచ్చైస్స్వనంబున. 199

ఆ॥ కవిత యనుకొళాయి గట్టిమో యవధాని! నాదువ్యస్తపదమునకును వ్యవధి
నొసఁగవయ్య! యనుచు నొకయెనిమిదక్కరాలచటునచటఁ దెలిపినంత మాను.

క॥ కడగ నిషిద్ధాక్షరి నేర్పడరఁగ రెండవపదంబు నమునప్పుడె చ
ప్పుడుగా గంటల నెనిమిది వడిగా రంగావధాని పఠియించుటయున్. 201

గీ॥ శ్రీమయి సద్దు నెసంగిడిసమయమందె వీఁపునన్ జగ్గుదీక్షితుల్ వేసెఁ బూలు
రమ్మటంచును బట్టాభిరామశాస్త్రి తనసమస్యను వ్రాయ నిట్లనుచుఁ జెప్పె.

వ॥ "మక్కుటఁగా ననున్ "వల దహో! కనఁ బ్రాసము ప్రాసమే యతుల్" తదు
పరికల్పనాపద్యమున " నిలువన్ జాలినసాయకావళివలెన్ నిర్ణిద్రరావంబుతో "
నని రాయప్పసోమయాజులకు వచించి, "రావుగారూ! గురిము నడ్డమువేశి
సహోమాత్రము దప్పించుకొంటిరి -కానిండు- నామంత్రిచే నిచట మరల సహో
గొట్టెదఁ జూచుకొం"డని పురాణశ్రవణకుతూహలాయత్తు లగుజనసముదాయ
ముం గనుంగొని యాపండితబాలకుం డిట్లు తెలుపసాగె. 203

చ॥ శరణు బృహన్నలా! నిలువఁజాల ధృతిన్ గొని పోరొనర్ప సం
గరమును గోవులన్ యశముఁ గాంచుట దైవ మెఱుంగుఁ జూచుచున్
గరములమీఁదుగా విడువఁగల్గు నెవం డిట నిండుప్రాణముల్
పురమున గేలి కప్పటికిఁబోలినరీతిఁ జరింపఁగా నగున్. 204

క॥ ఏపుండినఁ బ్రాణంబుల తీపు చనిన రణముమోజు తీఱనిచో నీ
వే పొమ్ము చంపఁ జావఁగ నీపున్నెము నన్ను బ్రతుకనీ చాముండన్. 205

క॥ ఇంతపగఁ బూని నాపైఁ బంతంబునఁ జావఁద్రోయఁ బాల్పడియెదు గా
సంతయును నీకుఁజెఱుపుం జెంతల నొకకీడు నేను జేసితినె కటా! 206

మ॥ చలముల్ డింపుము నాదుమాట వినుమీ చాఁబోకు నీవైన నీ
తలఁపుల్ మేఱకు మించుభాగ్యములచేతన్ గౌరవింతు న్నినున్
బలము ల్నిన్నును నన్నుఁ జూడకయమున్ రథ్యంబులన్ ద్రిప్ప నీ
కిల నేలోపము గల్గకుండుటకు నాదేపూఁట రా రమ్మికన్. 207

మ॥ అనుమానించెదవేల వెఱ్ఱి యిదిగాదా! భార్గవున్ మున్ను గె
ల్చిన భీష్మున్ గురుఁ దత్సుతున్ గృపు రథిశ్రేష్ఠున్ దినేంద్రాత్మజున్
రణసింహంబుల ధార్తరాష్ట్రులను బోరన్ జూచె దం దొక్కఁడే
మనలన్ మీరఁగఁ జాలు, నిశ్చయము పొమ్మా తేరిటుల్ ద్రిప్పుమా. 208

కం॥ అని దీనాలాపములోఁ గనుదమ్ములఁ జిందునశ్రుకణములతోడన్
దనపాదమ్ములఁ బడి లేవనివానిన్ గాంచి పేడి పలుకం దొడఁగెన్ 209

శా॥ ఏ నుండన్ ధర నీకు వచ్చెడిభయం బింతేనియున్ లేదు లె
మ్మా! నీప్రాణమె కాదు నీసుతలపూవేన్ వాడఁగానీను ర
మ్మా! నాతోడ రథంబుఁదోలుటకు నీవే యోద్ధవై సుంతలో
నీనాగమ్మతె గాదు లోకములు మూఁడే తెంచినన్ దోలెదన్. 210

ఉ॥ క్షాత్రుఁడవై గురుం డనెడిచానవు మాట నొసంగి, యోర్పు లే
కే త్రిప వీడి యీముఖము నేమని యామెకుఁ జూపువాఁడ లో
కత్రయముల్ నుతింపఁగ మగంటిమిఁ గార్య మొనర్తు రమ్ము నా
చిత్రతరప్రతాపమును జెచ్చెరఁగాంతువు లేచి రమ్మికన్. 211

మ॥ అనుపల్కుల్ విని శౌర్యజృంభితతదీయాకారముం గాంచి యీ
ఘనరూ పెట్లు బృహన్నలన్ గదిసె? లోకంబందు నెందైనఁ జే
డిని నీధైర్యము నీప్రతాపగతిధాటిన్ వేలునీ తేజునన్
వినమున్ గాంచ మటంచు నబ్బురమునన్ వీక్షించి శంకించుచున్. 212

ఉ॥ పేడివి గావు నిశ్చయము పేడికి నీదృశవర్తనంబు నే
జూడ నెఱుంగఁ; జెంగ్లివలె సంగరమున్ గనునీదుధైర్యమున్
జూడఁగ నీవు చంద్రుఁడవొ? సూర్యుఁడవో? దిగధీశ్వరుండవో?
వేడబమైనరూపుఁ గొని వేడుకఁ జూపురమాధినేతవో? 213

చ॥ ఒకరొకరే జగంబుల మహోగ్రతఁ గెల్వఁగఁజాలుశూరనా
యకులు కురుక్షితీశుదెస; నందఱు నీగతిఁ గూడివచ్చి పో

రికి నిటు కాలుద్రివ్వ నొకభృత్యుఁడునైనను దోడులేక ల
గ్గముఁబెను తెంపుసేయునిసుఁ గాంచఁగ నర్జునువ్రాన్కి తోఁచెడిన్. 214

వ॥ అంతఁ బరదేశిసోమయాజి — 215

క॥ ఆఁ! తరువాత విమర్శం బై తను వ్యక్తులు మెలఁగుగతి పలుకంగా
నీతతి వంతు పడిన దిఁక నేతద్విషయంబుఁ బల్కమి యీవరుసన్. 216

వ॥ అనిన వల్లెయని బాలుం డిట్లుపన్యసించె. 217

చ॥ అసదృశవాగ్విలాసపటిమాంచితతిక్కనసోమయాజి నీ
రసకవియే? తెలుంగుకవిరాజులకెల్లను మేలుబంతియై
యొసఁగఁడె? తత్సమానుఁ డొకఁడేనియు నవలఁ గల్గెనే? తను
ల్లసితకవిత్వవైఖరిఁ జెలంగునె దోషము? ఆంధ్రసత్కవీ 218
శసమితి మార్గదర్శకవిశాలయశంబు గడింపఁడొటు? కీ
కసములప్రోవులౌ యన వికారపుటూహ లయోగ్యభావనల్
బిసలుగ నేండ్లు కష్టపడి బిచ్చపుఁదైత జుగుప్సఁ గూర్చి చి
క్కసకణలేశమంత వెలగానియయోగ్యులె యాంధ్రవాగ్యశో 219
విసరము వారిమూలమున వృద్ధిఁ జెలంగెడునట్లు వ్యర్థ దీ
మసమున విఱ్ఱవీఁగఁ గవిమండలమాన్యుఁడు తిక్కయజ్వ కే
యసమమహాభిమాన మనయంబుఁ జెలంగఁగఁబోలు వాని వా
గ్విసరములందు నుంత కనుపించునె ధూర్తత? పామరార్యమా 220
నసహరమైనఁ గా కతిఘనంబుగ నాత్మకృతిన్ దలంపఁ డీ
వసుమతి సత్కవీంద్రుఁడని వాకొనఁడే తన కావ్యమందు వే
రసికుల నేని జొక్కనను రంజిలునట్టు లొనర్పఁజాలు తీ
పెసఁగుకృతుల్ ఘనర్చినకవీశ్వరు లన్యకృతుల్ హరించి యే 221
దెసనొ స్వభుక్తి నొందఁ బ్రియతించునశక్తుల, వాక్సతీమహా
నసపరిశిష్టలేహనుల నవ్విరిగాని విమర్శకోత్తముల్
గసరిరె వాని కీయరె యఖండయశోభరితాగ్రపీఠముల్?
సని గలసత్కవీశ్వరుఁ డసమ్మతిఁ జూపునె సద్విమర్శ? కా 222
వ్యసుకవినాథులం దెసఁగెనా కవినింద? యొకింత కృష్ణరా
యసభికదిగ్గజేంద్రకృతులందు బయల్పడె నిందునందు నా
'వసు' 'మను' సత్ప్రబంధముల భట్టియుఁ బెద్దనగ్రంథచార్య నీ
రసతను బల్కి దాటి, రలరాఘవపాండవకావ్యకర్త దు 223

ర్వ్యసనహాతిన్ గవీంద్రకృతి వ్యంగ్య మెఱుంగఁగలేక తప్పునన్
పసియును బోల్చలేనికవినాయకతాత్మకదుర్విదగ్ధతా
మసుల నుపేక్షఁ బల్కి, నిది మార్గముగా కవినింద యంగమై
యసిగొని రానురా నొకటె యొప్పున నిల్వక గ్రంథకర్తృమా 224
నసమున కెవ్వ రెట్టివ్యసనం బొసగూర్చినఁ దన్నిరాసక
ప్రసరకవాక్యజాలము లభంగురశక్తిఁ దదీయశీర్షికన్
మసలుచు నాఁడునాఁటికి విమర్శకదూషణక్రింద మారె ని
ట్టిసరణి కర్తృపాండితికిఁ డీకగఁ జెల్లునె గాదె ? యెందునే 225
న్వస గలసత్కవీంద్రుఁ డయినన్ దన కార్యమునందుఁ దప్పులే
పొసఁగినఁ జూపుఁడంచు జలమున్ దగ సేయఁ యని పల్కఁగాని నీ
రసగుణవాక్ప్రగల్భములప్రౌఢి గణింపఁదలంచునే మదిన్ ?
లసుకు లుసుక్కకైతల గలాగల కొక్కఁడఁ బాపరాళి ప 226
ల్లసుకులు సూప దివ్యకవినాయకు మించినప్రజ్ఞఁ జెందిన
ట్లొసపరి బాగుటూహలమహోద్ధతి తుంపెసలాడ నెద్దియో
పసపస వ్రాసి సత్సభలఁ బండితసంఘము మ్రోల దానికిన్
గుసగుస లుప్పతిల్లు ననుకుంఠితచిత్తమునందుఁ హెచ్చికోల్ 227
మిసమిస లొక్కవింతజవ మేకొనఁజేయు విమర్శకాళిపై
గసిబిసివ్రాఁతలన్ జెటివి గద్దరి గండ్రతనంబె ప్రాపుగా
నసము గడింపనెంతు రడియాసల ధూర్తకవు ల్ధరిత్రిపై
విసవిస గుంజులాడి నుడివ్రేగున నొడ్లను బిట్టుతిట్టినన్ 228
దొసఁగు తనంతఁ జక్కనయి తోఁచునె శాశ్వతమై యెసంగదే ?
పసులనఁగాఁ దగుం దనదు బాగు నెఱుంగనివాని నిట్టి దు
ర్వ్యసతికిఁ దేరికన్ జెలఁగుపట్టున వీరు సముత్సహింతురే ?
కొనకు స్వకీయ ధూర్తత జుగుప్సను బెంపదె వీరిబుద్ధులన్ ? 229
వసిగొని యెవ్వరే నొరులవ్రాఁతలఁ దప్పులె పట్టి బిట్టుసం
తసపడుచుందురే ? తమకుఁ దా మొనరించుకొనంగనౌ నిజా
పసరము లెన్నియుండవు ? ప్రపంచహితాప్తికి నెందొ యెవ్వరో
యొసలిక గల్గువారలు సహేతుకఖ్యాతి విమర్శఁ జేసి పెన్ 230
దొసఁగుల నేరుచూపు టది దోసమె ? వాసికి మోసమౌనె ? పా
యసమున నింబబీజ మొక కైనను జే టొనరింపకుండునే ?

హాసనము కాదు, భ్రాంతి దుడుకారని ధోరణి కాదు వ్యర్థపున్
నిసుఁగుల సంత కాదు, కడునీరసవన్యకిరాతభాష కా 231
దసమయకోత్తమర్ణరభసాంచితవాక్ప్రపంచముఁ గాదు నూ
త్నసరణి హైందవార్యజనతాఘనతాధిగతాయతాభ క
ప్పసము నవీనశోభ బహుభంగుల నీయఁగఁజాలు మార్గ మో
కుసుమసమానగంధయుతకోమలమానసవృత్తులార ! స 232
ర్వసుగుణపుంజరంజితసూత్తసులార ! కవిత్వతత్వస
త్వసమరసత్వజిత్వరహితప్రియవర్తనులార ! శ్రద్ధను
ల్లసితముగా వినుండు మును లక్ష్మికి నిక్క ఫరాసురాష్ట్రి మొ
ప్పెసఁగుచునుండ “రిష్ల్యూ” సచివేశ్వరుకాలమునన్ గవిత్వ సృ 233
ష్టి సకలదోషవర్జితవిశేషతఁ బొల్చుటకై విమర్శకా
గ్రసరులఁ బండితోత్తములఁ బ్రాజ్ఞమనీషులఁ జేర్చి వారికై
వసముగ నెవ్వ రెట్టికృతిఁ బన్నిన దానిని నొప్పగించి త
ద్విస్తృతపరీక్షఁ దేలు నుడితీఱుల దిద్దఁగఁజేసి సాంఘిక 234
శ్వసన సమగ్రశుద్ధి గనుపట్టునటుల్ పొనరించి గాని సం
ఘసవిధమందుఁ బుస్తకనికాయముఁ జొప్పడనీయఁడయ్యె “రి
ష్ల్యూ”సుగుణశాలి దివ్యతరశోభ స్వభావముఁ గూర్పఁగోరి య
ట్టిసభల నేర్పరించుట కడిందిప్రయాసము నిచ్చు రాజసా 235
హాససహానుభూతియు సహాయము గల్గనిచోటఁ గాన నో
యుసమవిమర్శకాభఁ దగునాంధ్రమహాశయులార ! యేరిమా
నసమున నొప్పిగల్గునో యన న్వల, దార్థికలాభ మేమి మా
కెసఁగును లేనిపోనిసడి యేటి కనన్వల, దాంధ్రభాషపై 236
నోసపరి బత్తియున్నెడఁ, దదున్నతి మీహృదయాంతరంబులం
దెసక మెసంగఁజేయునెడ, నత్తెఱి నాంధ్రకళాప్రపంచమం
దసువుల నూని వెల్వడు ననంతకృతిప్రతతుల్ గ్రహించి, నీ
రసగుణమత్సరాదివిసరప్రసరంబుల కాంతు వెట్టి, స 237
ద్రసనకై స్వేచ్ఛ నిచ్చుచు, సరస్వతి నిత్యపవిత్రరూపగాఁ
బొసఁగునటుల్ పొనర్పరె నమోనమ యంచుఁ బరాకు దెల్పెదన్ ” 238

క॥ తదుపరి వ్యస్తాక్షరియును విదప నిషిద్ధాక్షరియును బ్రీతిని మూడో
పదమున మొదలిడి గంటలు పదియును బువు లాఱు బుద్ధిఁ బదిలముగాఁగన్.

వ॥ సమస్యలోని మూఁడవపద మగు "చిక్కని మిణ్గురుల్ కథయొ చేతికి నందక పాఱి
పోవు మిం" అనుదానిం జెప్పి కల్పనావృత్తంబున ద్వితీయచరణం బగు "నళిబృం
దమ్ములు నూత్నపుష్పములచాయఁ జెంగునఁ దాఁటియా" అను దానిని వ్రాసి
కొమ్మని చదరంగంబున రావుగారు రాజున కేనుంగు నడ్డంబుఁ జొనుపుచో నతని
మంత్రికమ్మిక వాయ "నేమండీ! మంత్రిని మా కిచ్చినా"రని శకటుపరువున
మంత్రినిం గొని పురాణకథనంబున కున్ముఖుండై. 240

మ॥ కలవే గుండియ లొక్కపార్థునకుఁ దక్కన్ భూమి నెవ్వాని కి
ట్టుల విల్లంబులు కంకటంబు దొనకట్టుల్ చక్రిసంరక్షకుల్
బలగంబుల్ బడిలేక కౌరవచమూవారంబుపై నెత్త నీ
కలరూపున్ వచియింపు మెవ్వఁడవు నిక్కం బర్జునస్వామివే? 241

క॥ అని గుచ్చిగుచ్చి యడుగన్ దనపేడితనంబు వోయి నైజశరీరం
బనువుపడుటఁ దలఁచి నరుఁడు "చనెఁ బదుమూఁడేఁడు లింకఁ జాటుది యేలా?

ఉ॥ "పోరున నెట్టులున్ గనకపోరు నిజస్థితి"నంచు లోన ని
ర్ధారణచేసి చిన్నగవు దర్పము పెంపున కుబ్బగూర్చ, వి
ప్పారినమోమునన్ దనముఖాబ్జము మాత్స్యుఁడు సూచుచుండ "ర
మ్మా రయ మొప్ప నేగుచు వచించెద సర్వరహస్యసంగతుల్. 243

శా॥ నిక్కం బింకను డాపనేల నగునా నీయూహ సత్యంబె సు
మ్మక్కౌరవ్యులమాయ కోడి ధర సత్యంబే జయంబంచు మే
మక్కాంతారములం దిరారు చనఁగా నజ్ఞాతవాసాబ్ద మీ
ప్రక్కన్ దీర్చితి మిట్లు నీజనకుదీవ్యద్ధర్మరాజ్యంబునన్. 244

సీ॥ కంకుండనెడిపేరు గాంచి కొల్వున నుంచు యతిరాజు మాపాండవాగ్రజుండె
వలలాంకుఁడై వంటఁబలుకుచున్ గుటిపించువంటలవాఁడు మావాయుసుతుఁడె
మావుల నరసి దామగ్రంథినామంబుతో నెసంగెడివాఁడు మానకులుఁడె
గోపాలనమునఁ దంత్రిపాలుఁ డనఁ బెంపెసఁగువాఁడు మాకడసారివాఁడె
రాణివాసంబునందు సైరంధ్రియనెడి చానయే సుమ్ము మాయాజ్ఞసేని యింక
నన్నెఱింగితివే కదా నరుఁడననుచు రమ్ము త్వర నాశమీవృక్షరాజమునకు. 245

క॥ అని యర్జునుండు పలికిన విని యావైరాటి శంక వీడనిమదితోఁ
గనుఁగొని నీవు నరుఁడ వైనను నమ్మఁగ దెల్పు మతనినామకథ లొగిన్. 246

ఆ॥ అన ధనంజయుండు నర్జునుండుఁ గిరీటి ఫల్గునుండు జిష్ణుపార్థు లనఁగ
శ్వేతవాహనుండు బీభత్సుఁడును విజయుండు సవ్యసాచియు ననఁ బరఁగి. 247

క॥ వెలయఁ బడిపేరు లతనికిఁ బలుతెఱఁగులఁ గలిగె ననుచు వచ్చినవిధముల్
పలుకుచు శమీలతవుడరి నిలఁబడ వ్రేఁకొనపైన నెగడుశరంబుల్. 248

క॥ చూపించి యుత్తరా! మా మాపటుతరసాధనముల మనుజు లెవరుచుల్
రూపించుకొననిరీతిగ నాపయి నిల్పితిమి గను శవాకృతిగాఁగన్. 249

చ॥ అవతలఁ దక్కఁగల్గు విపులాయుధంబుల నీ కెఱిఁగింతుఁ జూడు కౌ
రవబల మెంతొ దవ్వరిగ! గ్రక్కున వృక్షము నెక్కి దాన గాం
డివము దొసల్ తనుత్రముల్ వడిన్ గొని తెమ్మని పల్క నుత్తరుం
డు వనజ మెక్కి వానిని గనుంగొని గైకొనివచ్చి యిచ్చినన్. 250

చ॥ కరములు మోడ్చి ఫల్గునుఁడు గాండివమున్ గొని నిండుభక్తి స్వా
త్సరసిజమందుఁ బాకరిపు ధ్యానమొనర్చినమాత్ర వెల్గుల
బ్బురముగఁ బ్రబ్బఁజేయుచు సపూర్వపురీతిఁ గిరీట మున్నతిన్
శిరమునఁ గోఁచెఁ గర్ణములఁ జెన్నలరెన్ వరకుండలంబులున్. 251

క॥ పరదేశిసోమయాజులు కరమున్ వ్యగ్రిస్వనంబు గ్రాల వధానీ!
విరమింపు దీని నీపయిఁ బరమవిమర్శకకవిత్వపదముఁ జెపుచునన్. 252

చ॥ హాసదు! హాసాదు! సాధు! తగు! నౌ! భళి! మే! లహహా! యహో! యహో!
హాసఁగు శబాస్! బలే! వహవ! పొందదిరా! వురె! వహ్వరే! పసం
దుసులు మజా! భళారె! యువాహహో! యనిమాటికిఁ జెంత నిల్చి యే
త్రిసకణలేశ మంతయు ముదం బిడుసంగతి తోఁచినంత మె 253
ప్పొసఁగదువార లుండిన మహోత్సుకతాపరిపూరితాత్ములై
వెస రచియించుఁ గబ్బముల వేలకువేలు కవీశ్వరుండు సా
హస మెసఁగంగ సంతసమె యాఁకలులేనిబలంబు గాన - నో
యసమవిమర్శకాభిధఁ దగునాంధ్రప్రపాశయులార! మెచ్చుకో 254
ల్పసతి నుపేక్ష సేయక యపాత్రకబుద్ధి యథార్థ్యానుభూ
తి సెయ సద్విమర్శ ప్రపాతించుఁడు పెంపుఁడు మీ సరస్వతిన్.
పసిఁడికి వన్నె దెచ్చుశిలవంటిదెసూనుశ్రీ విమర్శకైతకున్
దొసఁగులమేల్గుణంబులను దూఁచి ప్రకాశ మొనర్చుచుండుటన్. 255
రసపరిపోషణంబు, రసరివ్యతిరేకం దగుశయ్య, శయ్యకున్
వసతిఁ జెలంగుపాకమును, బాఁయుక్తి లలిపే శ్రవించుపా
త్రసమయశుద్ధి, యౌచితి, నిరంతరతం బగు కాంతి, కాంతికిన్
బొసఁగునలంకృతుల్, కృతికిఁ బొల్పొను సంగడు నాక్షింగత్కృతుల్, 256

ధార! పరవర్ణ్యసమ్మద
పూరకవరమార్గగా! ప్రభూ! పరమాజ్ఞా. 265

గీ॥ తవిలి ముమ్మూర్తుడు రంగావధాని గొట్టి జగ్గదీక్షితు లీరారుసారు లేయ
మొత్తమూహించి గంటలు ముప్పదియును మూడుపూవులు ముప్పదేడా డేసనిరె.

క॥ పదపడిసమస్య కల్పనలొదవన్ బూరించి వాని నొక్కొక్కటి గాఁ
జదివె నిజగానమాధురి నొదవుముదము సభికులందు నోపిక బెంపన్. 267

సమస్య ఉ॥ గ్రక్కునఁ గైతఁ జెప్పుటకుఁగా మదిఁగోరి యశిక్షితుం డొకం
డుక్కుఱఁగా ననున్ వలదహో! కనఁ బ్రాసము ప్రాసమే యతుల్
జిక్కని మిణ్గురుల్ కథయె చేతికి రాక యపాటిపోవు మిం
చిక్కులఁ బెట్టఁబోకుము నుతించెద నోకవితాసరస్వతీ! 268

కల్పన. మ॥ అలవోకన్ విలువీడి తీవ్రగతిగమ్యస్థానలగ్నంబులై
నిలువన్ జాలిన సాయకావళివలెన్ నిర్ణిద్రరావంబుతో
నళిబృందంబులు నూత్నపుష్పములచాయన్ జెంగునన్ దాఁటి యం
దలఁతిన్ బోక రసంబునై కొనెడి నత్యంతంబు నో మిత్రమా! 269

వ॥ పిదప నాలుగెత్తులలో నారాయణరావుగారి రాజును మూలకుం దటిమికట్టించి
పురాణశేషంబు నందుకొని. 270

చ॥ కవచము మున్నె మైఁ దొడిగి కాంచనపుంఖములైన బాణముల్
గవదొనలన్ ధరించి నడికట్టు బిగించి కృపాణ మూని యు
త్సవకరమైనశంఖమును దాల్చి విరాటకుమారుతోడ పా
ర్థివుఁడు రథంబుపైకుఱికెఁ దేజము చిందు ప్రతాపవైఖరిన్. 271

ఉ॥ పూనిక గౌరవుల్ దమకు మున్నొనరించిన క్రూరకృత్యముల్
గానల నట్లు దాము పడుకష్టము లెల్లను గ్రొత్తక్రొత్తలై
మానసమందు రోషగరిమంబును రేఁపఁగ దేవదత్తపున్
ధ్మానము నించె నద్దెసలఁ దద్ధ్వని ప్రాణులమూర్ఛపుచ్చఁగన్. 272

ఉ॥ గింగురుమంచుఁ జేష్ట లుడిగించిన మూర్ఛిలి తేఱితేఱకు
న్నం గడుఘోష గాండివగుణంబున మ్రోఁతయుఁ గ్రమ్మ దేఱ సే
నాంగము లెల్లభీతి పడినన్ గని ద్రోణుఁడు "వీఁడె కిరీడి" యన్
పొంగులువారు మైగగురు మోదము పెంపును దెల్పుచుండఁగన్. 273

శా॥ సింగం బాకటితో గుహాంతరమునన్ జేడ్పాటుమైనుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో

జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడెవ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. 274

వ॥ అనియె దీనిభావం బేమన. 275

ఉ॥ ఆఁకలిపెల్లుబాధ నెఱకై గుహ నిక్కుచు, మ్రోగు నేన్గుగుం
పాకెలనం గనుంగొని, మహోరుషఁ బైఁబడఁజూచు సింగమ
ట్లేకడలేని కాఱడవి కష్టము లాత్మను రేఁప, యుద్ధపుం
గాకల భీకరాకృతిని గ్రాగు చిదే నరుఁ డేగుదెంచెడిన్. 276

వ॥ అని బాలకుండు పురాణంబుఁ జాలింప. 277

గీ॥ చొక్కుఁగొని యున్న పరదేశిసోమయాజి భళి కవిత్వవిమర్శసంబంధకథన
మును సమాప్తంబు సేయుమీ యనఁగ బాలపండితుండు నిరాఘాటఫణితిఁబలికె.

చ॥ అసితమహాంధకారనిలయంబుల త్రేల శశాంకుఁ డవ్విహా
యసమునఁ దోఁచి వెన్నెలల నన్నిఁటఁ జీకటి వాపియున్ మలీ
మసమగు కందువాయ నసమర్థుఁడెగా, గురిగింజ యెంతయూ
పసియుఁ దనంత కెజ్జిగురువారు మెఱుంగులఁ బోలఁ డంచుఁగే 279
కిసలను గొట్టుకైపున స్వకీయపు నీలిమ కంధమౌకదా!
కుసుమమరందపానమునకున్ గుతుకం బెదఁ జెంగలింపఁ ద
ద్రససుఖపానలోల మళిరాజము కంటకపాళి నెన్నునే?
కిసలము లానుచున్ గడు సుఖించుపికంబులు వృక్షశాఖికా 280
శసితమనోహరత్వమున వందురునే? మును పాకృశానురే
తసుఁ డటు మోహినిం గని గతత్రపుఁడై ప్రథ నీఁగఁడే దివౌ
కసు లమృతంబు నొందఁ జెలికారముఁజూపుజడాత్ములైనరా
క్షసులను మోసపుచ్చి తమసాహసవృత్తి విమర్శఁజేసిరే? 281
కస టిసుమంతయే నెసఁగ గర్వపుఁగక్కుటితిన్ స్వకీయవై
శసము దలంపఁబో కథమసత్త్వులు శ్రేష్ఠులుఁగూడ దానివా
యసము బలిన్ వలెన్ మఱుగునం దడఁపన్ బ్రియతింత్రు మున్ వనౌ
కసుఁ డగువాలి కూలిపడఁగాఁ దరుమూలమునందు డాఁగి నా 282
ఁస మొసగించి ప్రచ్ఛలకు రాముఁడు దాఁటుఁడె కుప్పిగంతులన్
గసిమిరి కౌపథమ్మ తరిగా నిడకుండిన జాతవేదుమం
దసమున దాఁచినన్ గరళదర్పితఘోరభుజంగమంబులన్
వసనమునన్ మడంచికొనినన్ బరశేషము నిల్పుకొన్న బా 283

వసుధలఁ బుట్టువ్వార సుగుణల్లరికేగద 'ధీసుతా మతి
ప్రసరతి ధీప్రమాద' యని కాళిలెదు సామెత లోకమందు; బ 291
ల్యసవస రేల ? భూభువనకర్తనిరంతరసృష్టికార్యయుక్
మసకల నొందకుండ నసమస్త చరాచరసృష్టి లోటుపా
టొసఁగని దివ్యవృత్తిఁ జరియింపఁ దరంబె కదా ! యట్లు గాక మే
లుసులునఁ గొన్ని కలితము లందు సుజాపఁ గొన్ని విల్చు పే 292
టిసరి ? స్వకర్మచేతనె కదింపఁబడెదం మెసఁగుచున్నఁ దై
తసనియు నట్టిచో యుజ్వల రాలిత్మ సమాపక మానుగాదె మా
విసుఁగుతు కావ్యసృష్టి నిలుపు రంగావున నొప్పఁబూని పే
తుసరసతన్ వివర్తనిధౌ జీ గోచిన సాదరించి యా 293
విసరులకున్ జవాబిడఁ బిలు సెలంగిరేఁ జూడుఁ డెట్టిపీ
ల్పొసఁగనిచోఁ గృతజ్ఞత సమానము ముదమున దిద్దఁ డీకృతిన్
రసమును పోషణమును శిరముల సంఘర్షలం
దెసఁగెదు చేఁబవళ్ళు కసు పోషితనైన్ గిజా పోరస 294
ద్యసతిఁ, గిరీటిమాధవ భాషా బనస్పతి సాహ్యవయుక్రియా
వ్యసనము మీఱ వాణికి నిరంతరసౌఖ్యసాధివర్ధనా
నుసరణయోగ్యవృత్తుల మనోగతిఁ గూర్చి యశస్సుచంద్రికన్
మసలఁ జరింపుఁడీ ! వరవినమ్రకులార ! కవీంద్రులార ! మీ
కొసఁగెద వేనవేలు వినయోజ్జ్వలవిజ్ఞపనోక్తిహారముల్. 295

గీ॥ తల్లులారా ! మహాసభాస్తకులార ! దండిపండితులార ! వదాన్యులార !
ముగిసె నష్టావధానంబు మొప్పుకున్నఁ దాల్మి వహింపుఁ డెందేని దప్పు లున్న.

క॥ అనుచు సదస్యుల కంజలికి నమస్కారంబొనర్చి కృతకృత్యుండౌ
మననూత్న పండితుఁడ కందునఁ గరతాళంబు లెసఁగె స్తోత్రంబులతోన్. 297

వ॥ అంత నష్టావధానంబునఁ బృచ్ఛకులుగా నుండిన పలువురు దమతమ యభిమాన శాస్త్రిదులయందు వాక్యార్థములకుం దొరకొన వరుసగఁ దర్క, వ్యాకరణ, ధర్మ, మీమాంసా, వైద్య, జ్యోతిషంబులను, దక్షిణవేదాంగంబులను, యమనియమాది యోగప్రపంచంబునను, మతవైశేషికంబులను, రాజ్యప్రతిపాదకనీతి సంగ్రహంబులను బ్రిజ్ఞాపరీక్షార్థ మగుపరిమితసంభాషణంబులు ముగియ,

## —• భారవి - ఉత్కర్ష •—

ఉ॥ అంతట నొక్కరొక్కరె గృహస్థుని జేరి యనేకరీతులన్
దాంతరలై జనించుపరితుష్టిని బాలకుప్రజ్ఞ ధారలో
శాంతి యొసంగకుండుపటుశక్తి ప్రతిక్షణనూత్నభావవి
క్రాంతి సమగ్రపాండితికిఁ గ్రిందుగ నెన్నఁడొడంగి రయ్యెడన్. 299

రామావధాని

ఉ॥ ఏమితపఃఫలంబొ ! సుతు నీదృశుఁ గాంచితి పాలవెల్లిలో
నామెయిఁ బూర్ణచంద్రుఁ డుదయంబయినట్లు, సమగ్రతన్ గళాఁ
స్తోమము లెల్లెడన్ బఱపి సూరిమనఃకుముదప్రమోదవి
ద్యామహనీయతన్ బెనుపుతగ్గు లెసంగనినిం డొసంగఁగన్. 300

రంగావధాని

సీ॥ మనుభగీరథుతపంబును మెచ్చి జూటసంగత గంగ వదలుశంకరునిపగిదిఁ
దనపాండితీస్ఫురల్ దనదుసర్వజ్ఞత్వపదసమున్నత కెలపారపు గాఁగ
ధార గంగాధారగా రహింపఁగ గానవైచితి పలుహొయలై చెలంగ
భావగుంభనమే ప్రవాహగాంభీర్యంబుగా నలంకారచంక్రమణపథమె
తఱఁగలన్ దళుక్కుదీను చంద్రికళ గాఁగఁ దనరుసంతోషమే సుధాధవళఫేన
సంతతోత్పతదాపఃప్రసారగతిగ నొప్పెనీసుతుఁ డెంతధన్యుఁడవు నీవు. 301

జగ్గుదీక్షితులు

ఉ॥ వాసన లాకృతుల్ రుచులు వస్తుగుణంబు లనేకపద్ధతు
ల్గా సమయానుకూలములుగా విలసిల్లునుమంపుమాలయుం
గా సుమనఃప్రియావహాముగాఁ గవితానుమమాలికావళుల్
నీసుతుఁ డిట్లునింపె సఫలీకృతజన్ముఁడవైతి మిత్రమా ! 302

పట్టాభిరామశాస్త్రి

ఉ॥ ముద్దులు గుల్కుశయ్య కడుముచ్చట లీనుతలంపు, లందులో
నొద్దిక వెల్గుమేల్పదము, లూహల నిండగుకల్మి, మాధురిన్
హద్దిడరానిగానకళ, యమ్మక చెల్ల ! భవత్కుమారుతో
నుద్ది జగంబునన్ గలరె ! యోయి ! కృతార్థుఁడవైతి వన్నిటన్. 303

రాయప్ప సోమయాజి.

గీ॥ ఆదరుబెదరులేని యాతెంపు రసపోషణమున కమరి తమకతమకపదము
లొనరి యిముడు పెంపు నొప్పునే యీరీతి పండె నీదు పుణ్యాపథము సఖుఁడ !

నారాయణరావు.

మ॥ వహవా! పూనిక బంటుతెంపు, శకటుప్రారంభ మాసూక్తి పెం
పహహా! ధోరణి నిండుహస్తిగతి, యూహల్మ్రావు పళ్యాళ్ళు, స
ర్వహితప్రజ్ఞలు మంత్రిపోకడలు, భావప్రౌఢిమా రాజరీ
వి, హాసా దీకవిరాజుధాటి కెదురే వే ఱెవ్వరున్ మిత్రమా! 305

సీతారామశాస్త్రి.

మ॥ తగులన్ ముట్టి యనేకయోధు లటఁ బద్మవ్యూహమధ్యంబునం
దెగువన్ నిల్చి శరించి నొంచి కొసఁ బోయెన్ బార్థపుత్త్రుండు, నే
డో గిరు ల్నాఁ దగుపండితు ల్చనకి చుట్టుం గొట్టులం గూర్ప శ్రీ
లగ గెల్పొందె భవత్సుతుం డభవులీలన్ బండితశ్రేష్ఠుఁడై. 306

పరదేశి సోమయాజి.

ఉ॥ పేర్చిన భావనల్ రకపు పిండులుగా, కవనంబు గానమున్
గూర్చిన పాకధారలుగఁ, గోమలవాక్తతులందు ముంచి పై
కేర్చిన భక్ష్యవస్తులుగ నెంతయు నిన్నటి విందుకంటెఁ జే
కూర్చె ముదంబు నీతఁ డిదిగో మది "లొట్టలు" వారు నిప్పుడున్. 307

చ॥ అనుచు సభాసదుల్ దనమహత్త్వమొకొక్కఁడె పల్కఁ బాలుమో
మునఁ గళికాసముజ్జ్వలితమోదతరంగము లా హిమాంశు సం
జననమునన్ బయోనిధి నెసంగుతరంగము లట్లు పొంగె ను
బ్బున గళసీమ నిండి పయిపొంగులు కన్గవఁజింది పర్వఁగన్ 308

చ॥ తల బలిసెన్ సభాసదులు తన్గొనియాడుచు గొప్పసేయఁ గ
న్నులు తలపైకివచ్చె నభినూత్నవధాని కటున్నయున్కనే
పులకల మిన్నురాయు బలుపున్గని నట్టులఁబొంగి గర్వచి
హ్నలు విలసిల్లు చూడ్కుల విహాయసవీథిని జూచుచుండఁగన్. 309

ఉ॥ ఆతని తండ్రి లేచి సభనందఱకున్ నతి దెల్పి మిత్త్రులా
రా! తమవత్సలత్వమున నంతలు నింతలుఁ బల్కుమాత్రిగా
కీతని తెల్వి మీనుతుల కెక్కఁగఁ జాలినయంత గొప్పదౌ
నే తమదీవనల్ బలము నిచ్చిన గాఁగలవాఁడు మీఁదటన్. 310

క॥ కన్నులఁ దెలుపఁగఁజాలని పిన్నాతఁడు వీనినింత పెద్దగఁబలుకన్
జన్నె! తమకనులముందట నిన్నటికిన్ గోచిలేక నెగడఁడె యింటన్. 311

క॥ ఆమేనమామచలువ న వేమే మోచదివి చిలుక యెసక మెసఁగఁగన్
మీ ముందట రువ్వెడి నిటు లీమాత్రికె యింత సేయ నేటికి మీరల్ 312

క॥ అనుచున్ వినయోక్తులఁదన జనకుఁడు వచియించి సభను జాలించి సమ
ర్థానియతి నాగంతుకజనమును బనుపుచుఁనుండ నతనిపుత్త్రికుఁ డొకచోన్. 313

## భారవి - గర్వము.

సీ॥ గ్రహాణంబు సోకినఁ గందికుందెడుచంద్రుగతి మోఁగం బింతయై క్రుమ్మఁబడఁగ
సోకిన మునుఁగు విష్ణుక్రాంతమును బోలి పొంగినపులకలు బ్రుంగి యణఁగ
పొంగు లడంగినప్పుడు తెల్లపాలపోకఁ జిరాకు మోమున గంతులిడఁగ
నాగస్వరము నాపినన్ వాలుపడగచందమున శీర్షం బవనతము గాఁగఁ
జిచ్చుబుడ్డిన ధూమంబు సెగలు లేచునట్లు లత్తుల నవమతి యాగ్రహంబు
రేఁగి యాస్యంబుపైనల్లాఁగ సుడియఁగొత్రియవధాని మనము గగ్గోలుగొనియె.

క॥ ఎడగాఁగ నిలిచి సభ దనకొడుకుమహానందగరిమకున్ ముచ్చటలన్
బడుతల్లివానికొండలపడువై ఖరిఁ గాంచి వింతపైకొనుమదితోన్. 315

గీ॥ నిండు జాబిల్లి తటిపి వెన్నెలకు మేఘమ్ముల్లి సుతుమోద పఱ నేమియావహిల్లె
చెలఁగి కళకళలాడు నాచిన్నితండ్రిముఖము గడు చిన్నఁబోవుచు ముడుగబాఁఱె

క॥ అని యనుకొనుచును యోషిజ్జనసము దాయంబు ననుపుసందడిలోనన్
మునుఁగుటు నప్పటి కాయమ దవ సుతుదెస దృష్టి నిలుపఁదటిగా కేగన్. 317

వ॥ అంత మహావమానకలుషీకృతమానవునట్లు లాబాలకుం డుద్విగ్నమనస్కుండై.

సీ॥ వారణాశీపురీవాస్తవ్యపండితాగ్రణులముందలలపై మణుల దూల్చి
భాసితోజ్జయినీసభాసూరిశేఖరానర్ఘ్యకంకణదీప్తు లపహరించి
మగధపారిషదోక్తి మాహాత్మ్యచిహ్నంబు లైన మేల్పతకంబు లాక్రమించి
హాస్తినాపురమహీయస్థాన దిగ్దంతి గండపెండారముల్ గ్రిమ్మి లాగి
దీక్షగొని జైత్రయాత్ర నద్దిక్కులందుఁ గలుగు నెఱచదువరుల కస్గవల మెఱసి
వెలయు మత్పాండితీయశోవిలసనంబు నేల మెచ్చఁడు జనకుం డి దేమి యనుచు.

మ॥ చుఱుకుంజూపుల నోరగా జనకుఁ జూచున్ సుంతలోఁ దేఱు, లోఁ
గఱకున్ బూని వివాద "సఁయ్" యనుచుఁ బల్కున్ బూను నల్లంత నా
గురుతున్ గప్పఁ దొలంగు ; అప్పఁబలుకన్ గోపించు నాగున్ ; బనుల్
మఱచున్, దొట్రిలు, పొంగు, లొంగు నతఁ డున్మాదంబు గొన్నట్టులన్. 320

శా॥ ఇస్సీ! రోఁకటి పాటగా శ్రుతులలో నే కొంతో వల్లించి యా
నిస్సారాధ్యయనాప్తి వేదజడుఁడై నేర్పానఁగాలే కిటుల్

బుస్సల్ గొట్టెడి నారం! బుద్ధియెటనే బుగ్గిన్ వినాసిల్లె నా
నిస్సీమప్రథ నింద రిట్లు పలుకన్ వీఁడేల కుంవాడెడున్. 321

క॥ అని యేమేమియొ తనలోననె గొణుగుఁ గరంబు విసరునన్ దిప్పానొరల్
గనిపోదురో యని నిబ్బాముసు గొను మల్లడి మునుంగు బుద్ధి చెదరఁగన్. 322

క॥ ఆరేయి నన్నుమిట్టటు దూరముగాఁద్రోసి సంజితొలఁగి నిదుర చే
కూరమిఁ దారట్లాడుచు వారని క్రోధంబు లోన వర్ధిల్లంగన్ 323

సీ॥ వాదింపరమ్మె సవాలని పిల్తునా? తండ్రిపై రేఁగుట అప్పనెంత్రి
వీనితో నేమని వెస లేచిపోవనా? తల్లి బెగ్గిలి చచ్చుఁ దాళలేను
యీ క్షోభ మేల చెయింతునా హత్య? నమ్మఁగనైనవారి నెయ్యాండ్రిక్రఁగాంతు
నింతగొడవ యేల నేనె జీవంబుఁజాలింతునా? మనసు చలించునేమొ?
తేఁ డిపుడు తండ్రి యింట బలేసమయము పరులెఱుఁగకుండనొక పెద్ద బండఁగొనుచు
నతఁడు పవళించుగదిలోన నటుకపైన నుండి యేకాంతమున వాని నుక్కడంతు.

ఉ. పుత్త్రుఁడనైన నాపరునమున్ ఘనమున్ బొడగాంచి పొంగు పే
మాత్రము లేద. ఓర్వమిని మ్రిగ్గి, పరు ల్నను నుగ్గడింపఁ, దా
పత్రియ మేమి మున్నైనో, యపత్రిప నేఁదగనంచుఁ బల్క? నీ
మాత్రపుతండ్రి యుంశినను మండిననేమి? వధింవితీ ఔదన్. 325

క॥ అనుచుఁ దగుమాత్రి మగుశిలఁ గొని గదిలో నటుకపైనఁ గ్రోధము తెంపున్
బెనగొనఁగ నొరుల కెవరికిఁ గనుపడరాకుండె నతఁడు గడునాయత్తుఁడై 326

చ॥ వదినె ప్రయాణభారమునఁ బాన్పునఁ నిద్దురఁజెంద గొబ్బనన్
సదనము దిద్ది తీర్చుకొని సావడిలోఁ దనభర్తరాకకై
యెదురులు చూచుచున్ గృహిణి "యేమొకొ? పుత్త్రునిదారి సాజమా
కనురున లేదె? - యెంతపురికొల్పిన హేతువు గోచరింపదే? 327

ఉ॥ కావలయున్ సభ సదులు క్రిన్న నుతించెడుచోటుఁ దండ్రి "యే
లా? వినుతింప బాలు"నని యన్నది యాదిగఁ బుత్త్రిదర్య యే
మో విపరీతమై యెసఁగుచున్న దిసీ! తనముల్లె మున్నెనే?
లావుగ నంద జెన్నుకొన లాతిగఁ దా నటుపల్కనేటికో? 328

క॥ బావయు మఱఁదియు నిదె రా నేవచ్చి"రటంచు నామె యెన్నెడుచో "బా
వా! [illegible] 329

క॥ ఇట్టెకొనిపోయి బాలకు నట్టిచదువుగానిఁ జేసి కర్పింపగు మోదం
బుట్టిపడునట్లు చేసెతి పిట్టిగురుబ్రహ్మమూర్తి కే మీఁగలమో? 330

క॥ అన "మఱఁది ! బంగారం బనువైనది గానియెడల నాసొన్నారుల్
పనివడి చేసిన నేనియుఁ బనుపడునే మేలిపనులు పరివర్తింపన్. 331

మ॥ అతఁ డెవ్వండొకొ ? మేనయల్లుఁ డగుఁగాదా నాకుఁ దత్సంపదు
న్నతు లస్మత్కరణీయసద్విధులెగా ! నా కింక నావశ్యకుల్
సుతులున్ లేరుగదయ్య, వానికలుముల్ శోభల్ మదానందభా
వతరంగంబులు, దీని కింతలుగ సంభావింప నేలా ననున్. 332

చ॥ అని శుభ మాడుబావను శయానుఁ నొనర్చి సతీసమేతుఁడై
తనగదిఁ జేరి గేస్తుఁ డటఁ దల్పమునం దుపవిష్టుఁడైన వెం
ట నతనిభార్య వీడె మిడి నాథుని జూచి వచించె "హాయి మే
ల్దినముల శోభనంబులు ఫలించుట లీవిధమై చెలంగునే ! 333

చ॥ దినము లశోభనంబులు వధించుట లీవిధమై చెలంగుఁ గాం
చ నగును లెమ్మటంచు చటుకచక్కి నవీనకవీశ్వరుండు లో
న నె గుణియించుచుండునదనన్ సతి "యన్నియు మేలెగాని మీ
తనయునిప్రజ్ఞ నందఱును దద్దయు నెన్నెడు నాసభాస్థలిన్. 334

మ॥ తమరున్ మెచ్చుట పాడియౌ నటులఁగాదా యూరకే యున్నచో
నమరున్, రెండునుగాక బాలకుఁడు వీఁడా మీకు స్తోత్రార్హుఁ డం
చు ముధావాక్కులఁ బల్క న్యాయ్యమొకొ ? యొచ్చోఁజూడ మీచొప్పు, మీ
గమనం బాగతిఁ గొంటుకున్ గతము పల్కంగూడినన్ వేఁడెదన్. 353

శా॥ వేదాంగంబుల శాస్త్రసంచయములన్ వేదంబులన్ లౌక్యమ
ర్యాదన్ సర్వకళాకలాపముల నిర్ద్వంద్వుండుగాఁ బ్రాజ్ఞుఁడై
జోడై మించుభవత్సుతున్ బలువు రచ్చో మెచ్చుచో మీరు ని
ర్వేదం బొందు టదేమిపాడి సుతుఁ డుద్వేగంబునన్ డిందఁగన్.

ఆ॥ ములికపైని దక్కుమాటఁ డాప్రశ్నను విని బతెసవాలు వేసె నంబ
దీని కేజవాబు దెల్పునో యనుకౌతుకంబు హెచ్చఁ బొంచి కాంచుచుండ. 337

క॥ గృహస్థుండు మందహాసకందళితసుందరాస్యుండై. 338

శా॥ ఒహో ! మేలగుశంకయే తగిలె ! నేమో ! యుత్తరం బీయఁగా
నూహల్ దట్టునె మాకు నీకటుల, నుద్యోగింతు వీ వొగ్గు, ము
త్సాహంబుల్ వెలయించుపండితుల విద్యల్ శక్తులున్ దర్కస
న్నాహంబుల్ సమతిక్రమించుసుతుఁ డానందంబుఁ జేకూర్పఁడే ? 339

చ॥ ఎఱుఁగుదు వానిపొందితి, నహీనకవిత్వవధానశక్తి మి
న్నొంటియుమహాయశం బవడు నొందనిబుద్ధిబలంబు సర్వ మే
నెటిఁగియుఁ బుత్త్రినాయువున కెక్కడ లోటగునో యటన్న వె
న్వెఱఁగున, గర్వమెక్క నభివృద్ధికిఁ జేటని యట్టు లాడితిన్. 340

క॥ గురువును దండ్రియుఁ బెద్దలు గరము నుతించుటలు కొండికలకును జేటుల్
వరములు వృద్ధికరంబులు నిరతంబును వారియెడల నిరసనవాక్కుల్. 341

మ॥ సుతుఁ డుద్వేగము నొందెనంచిచి దివాశ్శోభాయమానోరు కీ
ర్తిత రాజిల్లుతదేయు పథపసంసద్ధ్యక్రైగా, నీవ తెన్
మతిహీనుండవె వాఁ డఖండపరిషన్మాండల్యమర్యాదలం
దతిదక్షుం డగు నూఱడిల్లు మహాస్వాలోచనల్ మానుమీ. 342

—* భారవి - నిర్వేదము *—

మ॥ అని తల్పంబున మేను వాల్చ శ్రమవాయన్ బాదసంవాహనం
బునకై భార్య యుపక్రమించునెడ "లే పార్థింపఁ బన్నుండు మీ"
వనుచున్ భర్త వచింప జాగిఁకను సేయన్ బోలదంచున్ దురితం
బున దూఁకెన్ బయిఁకుండి తత్సుతుఁడు మే న్మచ్చెన్మటల్ గ్రమ్మఁగన్ 343

ఉ॥ గాలిఁ జలించు దీపశిఖకై వడి మేను వడంక దన్వపైఁ
జాలిక లైన బూజువరుసల్ వెనటన్ దిగజారుచుండఁ బెన్
జాలి, భయంబు, చింత, తపన, సత్తువ గుంజఁగ, సన్నసన్నగా
మూలుగుతోడఁ దండ్రిపదమూలమునన్ బడి యేడ్వసాగినన్. 344

శా॥ ఆదృశ్యంబున కద్భుతం బెనయ శోకాయత్తయై భార్య నే
ర్వెదన్ గొల్లున నేడ్చునో యనుచు నాయిల్లాలినో ర్మోసి "బా
బూ! దైన్యంబును వీడి పల్కు"మని వీఁపున్ రాచి లాలించి యా
హా! దైవాజ్ఞ విచిత్రమంచు గృహి యత్యాశ్చర్యనిర్మగ్నుఁడై. 345

ఉ॥ బాలునిమేన బూజుమసి వాయఁగ శుభ్రమొనర్చి సెజ్జపై
సోలఁగఁ జేసి తాను సతి నూరెలఁజేరి "యిదేమి బిడ్డ! నీ
కేలఘుటిల్లె నీయటుక నెక్కి యిటుల్ పడి చింతనొంద? ర
మ్మేమలర యొక్కమాట వచియింపవె? యెట్టును మీ కుమారకా!" 346

క॥ అనినన్ దల్లిని దండ్రిని గని వయసగఁ గౌఁగిలించి కడుకష్టుఁ డహా!
యనుచు నికృష్టుఁడ, దుష్టుఁడ ననుము, గురుద్రోహినయితి ననుచుఁ బనవుచున్.

క॥ మాటకు మాటకు నేడుపు పెల్లెత్తఁగ మాటరానిబిగువు గళమునన్
గాటమయి పర్వ నెక్కిన మాటాడన్ లేక యొఱిగె మంచము మీఁదన్. 348

శా॥ "అన్నా! లెమ్ము, శయమ్ముఁ గైకొనకు, రమ్మా! నిద్రింపన్ నేఁడు గా
కున్నన్ రేపు వచింతుగాని యిపు డీయుద్రేకమున్ మాను, నీ
పున్నెంబయ్యెను బ్రొద్దువోయె నిఁక నేపుట్టున్ బురాణంబు నీ
వెన్నంగాఁ బనిలే దెఱింగితిని లెమ్మీ స్వస్థచిత్తుండవై." 349

గీ॥ జాలి ప్రేమయు వెల్లియంగ జనకుఁ డాడుసాంత్వనోక్తులకును బరిచర్యలకును
బుండు రేఁగి స్రవించెడుపోల్కి హృదయ మిఱిసినట్లయి తత్పుత్త్రుఁ డిట్లు పలికె.

మ॥ "జనకా! చూపకు మింత ప్రేమ మఱియీజాలిన్, గృతఘ్నుండ, దు
ర్జనుఁడన్, గర్వపరీతమానసుఁడ, నజ్ఞానుండ, నధ్వాండఁ గా
ననఘా! యెట్టికిరాతులున్ దలఁపఁ జేయన్ లేనిదౌష్ట్యంబు సే
యన సంపూర్ణమనంబుఁ గొంటి నిటు, నాహా! జీవ మింకేటికిన్. 351

ఉ॥ ఏమని తెల్పుదున్ బితరు నెంతయు సేవల మెచ్చఁజేయుటో
కామితముల్ ఘటించి కృతకార్యు నొనర్చుటొ? కన్నతండ్రియే!
ప్రేమవహించి పెంచి తగు పెద్దఁగఁ జేయు దయార్ద్రచిత్తుఁడే!
ఛీ! మతి లేక చంపుటకుఁ జేరితి నే నొకమానవుండనే? 352

చ॥ పొగరెగదట్టెఁ గన్నులకుఁ బోయె వివేకము బుద్ధిదెల్వి శి
క్షగఁ దమరన్న వాక్యమణిజాలము లీనునఁ బుట్టెనంచు నె
వ్వగఁగొని యిట్టిఘోరకృతిపాల్పడితిన్ బ్రతుకేల నింక మీ
మొగ మెటుచూచువాఁడ నిదె పో మరణించుటె శిక్ష నాకిటన్." 353

చ॥ అని కుతుకన్ బిగించుకొన నమ్మయు నబ్బయుఁ దత్కరంబులం
బెనఁకువ లాగుచున్ గనుల వెంబడి నీరము గ్రమ్మ గ్రుక్కిళుల్
గొని "తనయా! చలంబణఁచుకో! యవివేకపు సేఁత దిద్దఁజా
లునె యవివేకమున్? స్వమతిలోప మెఱింగి ధృతిన్ వహింపుమా! 354

క॥ ఘనపశ్చాత్తాపాంబువులను బూతపదంబులై చెలంగనియఘముల్
గనుపడవు చింతఁబాయుము విననేర్చినవాఁడ విట్టివెఱ్ఱి యిదేలా! 355

చ॥ ఇది యొకప్రొద్దుదోషమున నిట్లొనగూడెనె గాని నీవు దు
ర్మదమునఁ జేసి తన్న యనుమాన మొకింతయు లేదు నాకు నీ
యదనున దుర్గ్రహప్రహితమైన మహాపద యాదృశంబుగా
వదలిచనెన్ ముదంబుగొను వందురఁ బోలదు సూ కుమారకా! 356

మ॥ నను నీయమ్మను జూడు మామొగములన్ గాసంతకోపం బెసం
గునె ? విస్మారితమయ్యె నంతయును సంకోచంబు పోవీడు మి
మ్లానరింపంబడె నంచుఁ దెల్పుదుము నీ వొండెక్కడన్, జూడు ! ప్రొ
ద్దునఁ జిత్రిం బొక టీ వెఱింగెదవు వాదు లామ్మని నిద్రింపుమా !” 357

క॥ అని బుజ్జగించి యిఱుదెస జననీజనకులును శయ్య శయనించి కరం
బనురక్తి కరములన్ దమ తనయునిపై వైచికొనిరి తద్దయు వెఱతోన్. 358

క॥ కను మొఱఁగఁ జూచి యెక్కడ చనునో తనయుం డటన్న శంకఁ బితరులన్
ఘననిర్వేదము చిత్తంబున సోక సుతుండు నిద్రవో రారేయిన్. 359

ఉ॥ పొంగున వెక్కివెక్కి వలపోఁత నడంపఁగలేక “తండ్రి ! ని
న్నుం గడతేర్పఁబూనిన ననుం గడికండలుగాఁగఁ గోయ కి
ట్లుం గరుణించె డేటికి శరుల్ పరమాప్తత మిత్రులౌదురే ?
ప్రింగుమనంబు తేఱ దివిగో గయికోగదె నాదుప్రాణముల్.” 360

క॥ అనుపుత్త్రకునిం గనుఁగొని జనకుం డిట్లనియె “సుతుఁడ ! చచ్చినవెనుకన్
మనుజులకుఁ బాపనిష్కృతి నొనరించుకొనంగనౌనె యోపిక గొనుమా. 361

చ॥ చదువుల నన్నిటిన్ జదివి చక్కనిపాండితి సేకరించి గొ
ప్పదనము గాంచినాఁడవు భవన్మృతిచే నగుకర్మలోపమున్
మదిఁ గనవేటి ? కెందయిన మాటలు వేలుగఁ జెప్పవచ్చుఁగా
ని దృఢమనీష వాని గమనించు టశక్యము యెంతవారికిన్. 362

ఉ॥ పున్నరకంబు వాయ నినుఁబుత్త్రునిగా భగవంతుఁ డిచ్చె మా
కన్నిట సత్ప్రవర్తనుఁడ వౌగతి దిద్దెడువంతు మాది సం
పన్నగృహస్థధర్మమున వర్తిలి వంశము వృద్ధినొంద నా
పన్నతఁ దీర్చి మా కపకభావ మొసంగెడువంతు నీదిసూ. 363

చ॥ అవయవముల్ దృఢంబులుగ నాడెదునప్పుడె పూర్వపాపముల్
జివుకఁగఁ జేసికొంటయును జెండెడ్కొర్కులఁ దీర్చికొంటయున్
భవ ముడుగంగ యాతనలఁబొల్పడి శీఱవియాగ లెప్పుడున్
మివులఁ గుదింప పానిమిడిమేలము ద్రియఁగలేము పుత్త్రకా ! 364

మ॥ ఒకపాపం బొనరించి తచ్చ్యుతికిఁగా నొండొక్కపాపంబుఁ బూ
నిక సేయన్ సమకట్టు టన్యాకృతియానే ? తండ్రిప్రాణంబు తీఁ
తకు సిద్ధంబయి తెచ్చుకొన్నదశ నాత్మభ్రంశపంకంబునం
దిఁక రెట్టించుకొనంగఁ జూచెదవు ని న్నేమంచుఁ గోపింతునో. 365

చ॥ నిను గని పెంచి విద్యలను నేర్పినమాఋణ మట్లయుండ నీ
మనుపటికర్మ తీఱకయ మోహమున వ్రేలుచునుండ నీవు నా
తనమున నేఁ డొనర్చినది తద్దయుఁ గాళ్ళఁ బెనంగుచుండ నేఁ
జనియెదనంట యెట్టిసరసంబు ఋణంబు వెంట రావొకో? 366

ఉ॥ కైకొనుమంటి ప్రాణములఁ గావున నయ్యవి నీవి గా వికన్
నా కనువైనయట్లు కరణంబులుగాఁ బరిగొందు వానిచే
నాకఁలిగొన్నవాఁడు విడనాడునె మాస్తగతాన్న మెందు మీ
రాక, సుధాప్రపూర్ణనిధిరజ్జులఁ ద్రోయఁగ బిచ్చివారమే? 367

మ॥ ప్రతిపత్త్యాదిగ షోడశాంశములు సంపాదించు శీతాంశున
ట్లతికష్టంబున నిన్నుఁ బెంచి సకలాఢ్యత్వంబు నొందించి దు
ర్గతిసంగ్రస్తునిగాఁగ వీడుదుమె ఘోరంబుల్ విదారించి పూ
ర్ణతరానందము నొందుమంత్రములతో రంజిల్ల కోయర్భకా! 368

ఉ॥ కావున శంక మాని సుముఖత్వమునన్ జరియింపు మూర్ఖతన్
బోవిడు" మంచుఁ దండ్రి పలుపోకల బుద్ధులు సెప్ప దుఃఖపున్
గావిరి కొంత వాసి తమకం బణఁగన్ ధృతిమీర సర్వసం
భావన దెల్పు సూక్తుల క్షమాపణ వేడుచుఁ బుత్త్రుఁ డిట్లనున్. 369

— భారవి - సాంత్వనము —

ఉ॥ సంచిత మెద్దియో తదవసాన మెటుల్ గననౌనొకో? విచా
రించినఁ దోఁప దిందు వివరించెడువారును లేరు నేర్పువా
టించినసైనఁ దత్ఫలము డిందునె భుక్తిని గాక దాని న
ట్లుంచుఁడు నేఁటిపాపమున కోపినశిక్ష విధింపుఁడీ దయన్. 370

క॥ అన గాఢాలింగనమునఁ దనయున్ ముద్దాడి "తండ్రి! ధన్యుఁడ నయితిన్
మును నాచేసినపున్నెంబున నీదగుబుద్ధి తిరిగె ముదమయ్యె సుతా! 371

గీ॥ బాల్యయౌవనసంధిసంబంధబలము పెంపదే గర్వనిర్లక్ష్యవిరసగతుల
నీకుఁ దోలుదొట్ల నోపిక నిలువఁజేయుమార్గమున యాత్ర నడలుట మంచిదగు

ఉ॥ పొంగెడి పాలు నాఁగఁ బలుపోకల నుద్ధతి రేఁగు చిత్తమా
సంగతి జ్ఞప్తి నుంచుకొని సారథి గుఱ్ఱమునట్లు మెల్లలో
వం, మనంబు దిద్దుచుఁ గడంక సడల్పడకుండ యాత్ర పూ
ర్తిం గనఁజేసితే నఘము తీఱుఁ గృతార్థుఁడ వౌదు వన్నిఁటన్. 373

మ॥ అవధానాత్ముఁడ వౌచు నే నెఱుఁగఁజేయన్ బోవు యాత్రావిధా
వివరంబున్ విని "సౌఖ్యమూలమయి తృప్తిన్ గొల్పునీమార్గ మె
ట్లవు శిక్షాగతి" యంచు శంకఁగొన కత్యంతాస్థ సద్ధారి నీ
వవలంబింపుము కాన నీకగు సమస్తాఘౌఘశాంతుల్ సుతా! 374

గీ॥ అధ్యయనపూర్తి బ్రహ్మచర్యాశ్రమముఁ గలిగె నద్దానఁ దెలిసినకర్మధర్మ
విమలవిధులెల్ల నాచరణమునఁ జొనపఁ దగినగార్హస్థ్యమును బూనుతఱి ఘటిల్లె.

మ॥ సిరిసంపత్తులసాంప్రదాయగుణవాసిన్ సాటివిప్రాళిలో
నరుదౌకీర్తి గడించి యింపెసఁగుకుమారాదుల్ గడున్ మచ్చటన్
బరిచర్యల్ పచరింప బ్రాహ్మణులలో బ్రహ్మణ్యుఁడౌవిప్రుఁ డొ
క్కరుఁ డీసంధ్యఁ గుమార్తెయున్న నెసకంగా వచ్చె నిచ్చోటికిన్. 376

చ॥ అటనట నీప్రసిద్ధి విని యాఱలనిబిడ్డను నీకొసంగు ము
చ్చటఁగొని వచ్చి బాంధవులసన్నిధి నప్పుడు పృచ్ఛఁజేయ న
ప్పటికిఁ "గుమారుఁ డిచ్చటికి వచ్చినఁగాని వచింప"మంచుఁ దె
ల్పుట నతఁ డేగె నొక్కనెలలో నరుదెంతు నటంచుఁ బల్కుచున్. 377

ఉ॥ వచ్చును మాసమొ రతివంటిదఁటోయి తదీయపుత్త్రి మో
మచ్చపుఁజంద్రబింబమఁట యంగము లద్దినయట్లు పొందికన్
హెచ్చుముదం బొసంగునఁట యెంతయునమ్రత భక్తి తెల్వియున్
వచ్చెదురీతిఁ గల్గునఁట నామదికెక్కెఁ ద్వదీప్స యెట్టిదో?" 378

ఆ॥ అనుచు మనవునాలు లాదుతండ్రినిఁజూచి ప్రస్తుతంబు మఱచి పరిణయంబు
గోడవ దడవనేలకో యనుసుతునకి ట్లనియె జనకుఁ డాదరార్ద్రభణితి. 379

క॥ కేవలసౌఖ్యానుభవమె భావించుటఁ దెలియారెరు పరువుర గార్హ
స్థ్యావసరమునన్ గృహి యేయేవిధులన్ బాధ్యుఁడనుట నింతయు వత్సా! 380

సీ॥ శమదమసత్యశౌచరథంబు సంసృతిపథమునఁ దగుతీరుబడిని గనుట
దయయును దాక్షిణ్యంబు దానంబు శీలంబు సహితాపరోపకారములఁ జనుట
నరవిసాధనఁ దుష్టియును జేలోన్బడి సఖ్యసారంబగుచు మోక్షార్థ మగుట
ఘటిపరిన ప్రజకాచార్య, లశక్తులు తృప్తులై యానందవీప్తిఁ గనుట
భూతబలివిధానముల మెచ్చి భూతముల్ స్వస్తివాచనముల "శాంతి" యనుట
గలుగుఁజూవె చెడ వికారంబులకు లోను గానియాలుమగలు గ్రాలుచోట. 381

చ॥ అనలమె దీప్తమై కొలిమియై పెనుచిచ్చయి దావవహ్నియై
పనుపడుఁ గార్యజాలములపాళిఁ మెఱుంగక వాడువానికిన్

ఘనతరమ్మృత్యువై నెగడుఁగాదె; వివేకము దృష్టి దాల్చి యో
జనయును లేనిమూఢునకు సౌఖ్య మొసంగునె లోకవృత్తులన్. 382

సీ॥ మనుజులశక్తిసామర్థ్యంబు లెట్లట్లు పరిణామములు గృతిన్ బరఁగుచుండు
నేర్పువెంట నెగడా నెగడు మేల్కీడులు సుఖదుఃఖములు శుభాశుభము లెపుడు
పశుసౌఖ్యమునకు నేపాటు నక్కఱలేమి సులువుగాఁ గనుపించి సురిగి యేగు
మోస మెఱుంగక ముగ్ధులై యటఁ జిక్కి కాలంబు వ్యర్థయాటఁ గాంచి తుదకు
నట్టులిట్టు లొనర్పంగనైతి మనుచుఁ గృతిఫలము కట్టిడుదుపక యెడయుదనుచు
పాడుసంసృతి నరకంబుతోడి దనుచు నాత్మదోషం బెఱుంగక యాడుచుండ్రు.

సీ॥ అలమోహినీకథానంతరంబున శూలి యైనఁ గాపురమున్న నదలి తోలఁగ
నాభరద్వాజునియంతవాఁడునుగూడఁ 'గర్షతి కర్షతి కర్షతి' యనె
నల్ల విశ్వామిత్రునంతవాఁడును లొంగె నిజతపోబలమెల్ల నీటఁ గలియ
నారావణబ్రహ్మయంతవాఁడును సర్వనాశనంబున బ్రుంగి నలిగి చనియెఁ
గాన సంసారమనిన సౌఖ్యంబె గాదు, కాకపోదు; మెలంకువకలిమి వలయు
గాన నీపాపకృతికి శిక్షావిధాన మరసి సంసార మనునిశ్చయంబుఁ గంటి." 384

క॥ అనుచో "జనకా! నాపై ఘన మగు ప్రేమమున నిట్లు గల్పించెద రే
మనియొద నపకారికి నెపమును గొన నుపకార మొసఁగుపోల్కి యిదిగదా! 385

చ॥ సహజముగా సుఖాస్పదము సంసృతియం దతిచారమూని దు
స్సహఫలితంబు లొందు టుపచారములన్ దగుశిక్షయౌను; మే
లున్నవ్వహాఁ జరియింపఁ గాపురము చెన్నగు సౌఖ్యపథంబెగాదె? యిం
దహహా! మదీయపాపకృతి కయ్యెడిశిక్ష దురూహ్యమయ్యెడిన్." 386

క॥ అనుసుతునకు జనకుం డిట్లనియెన్ 'సంసారమందు నపిథారావ
ర్తన గొని మెలఁకువ మెలఁగు టె ఘనశిక్ష ననుక్షణంబు గల్పించు మదిన్. 387

గీ॥ అదియుఁ జాలదనిన నంబలికట్టి విచ్ఛిన్న మైనదాఁక సిగ్గు వదలి
య త్తవారియింట నణఁగియుండెడునంతకంటెఁ గలదె శిక్ష కఠినతరము.' 388

క॥ అను నెనిమిటిపాస్త్రద్వయిఁ గ. కేయుచుఁ శక్తి భార్య 'తగు నే మీ తె
ఘననీచతరము బుత్త్రుని బనుపఁగ నని గడ్డమూని పటువినముగన్. 389

సీ॥ అల్లారుముద్దుగా నరసి పెంచినవాని నతిసుకుమారదేహంబువాని
కసరించుకొను టెఱుంగనివానిఁ గడుమెప్పు లందుచు ఘనతఁ జెన్నలరువాని
పల్లెత్తుమాట కోర్వనివానిఁ గడుసున్నితం బైన వేలుచిత్తంబువాని
నాకలిబాధ నుంతైన సోకనివానిఁ గోర్కి నెగ్గక తాళుకోననివాని

కష్ట మెఱుఁగనివానిని గడుసుగాని చిన్ననాఁగన్నవానిని జేతులార
నత్తమామలబావలయాప్తముల కప్పగింపఁగ మనసయ్యె నయ్య మీకు. 390

ఉ॥ చాలును లెండు, పుత్త్రికను వేఁకన్ గలమీ తమి తెల్లమయ్యె నేఁ;
డేల పొసంగనిత్తు నిది ? యేసడికైనను నోర్వవచ్చుఁ బ్రా
ల్మాలియు నత్తవారికడ మ్రగ్గుచు హీనత కోర్వవచ్చునే
చాలమి నైననున్ బ్రతుకఁజాలమి నైన మహాపదైననున్. 391

సీ॥ కన్నుసన్నలఁగాని కాంచఁ బల్కఁగఁబోనిబిడియమూనెడువాని విడువనౌనె ?
సంజచీకటినైన శాలఁ బాయఁగ లేనిజడుపుకాఁడగువాని విడువనౌనె ?
సకలాస్థలును మాని చదువుపైఁ దమిఁబూని యడుగఁజాలనివాని విడువనౌనె ?
కడుపులోని జలంబు గదలనీక సతంబు నీడ నుండెడువాని వీడనగునె ?
యడిగినన్ బెట్టి కపరాధ మరయుచోటఁ గటికచీఁకటి కష్టంబు గననిచోట
కథలు గారుణ్యములటంచుఁ గసరుచోట మిట్టమిడియెండఁబోలమేఁగ నెట్టుచోట.

గీ॥ అనియసమ్మతి దుఃఖంబు నాతురతయుఁ బలుకుపలుకున వెలయఁగౌఁగిలినిసుతుని
బట్టుకొని భర్తతోఁ దగ్గి పలుకుచుండ నామె నల్లంత మృదువుగా నాపి సుతుఁడు.

—♦ భారవి - నిశ్చయము ♦—

క॥ "అమ్మా ! ప్రేమాధిక్యత నిమ్మెయి నుమ్మలిక మూనె దే నెల్లపుడున్
రమ్మా పొమ్మా యనువాక్యమ్ముల విద్దెంబుఁజూపు టర్హంబౌనే ? 394

ఉ॥ మీవలె నేనునున్ గులము మెప్పనకైన నొకింటివాఁడనై
యేవలనన్ బరాభవము లేర్పడనీనిసమర్థచర్యతో
నావిధి దీర్పఁగా వలయునా ! వలదా ! యిహమందు ? దానికిన్
గేవలపుస్తకాభ్యసన నిండయి యన్నిఁటఁ జాలియుండునే ? 395

ఉ॥ స్వానుభవంబుకంటెను గుణాధిక మైనప్రబోధ మిచ్చు ను
జ్ఞానులు నుందురే జగతి ? జన్మ జయప్రదమౌట వాంఛితం
బేని ప్రపంచరంగముల నెల్లెడఁ బాల్గొని జ్ఞానులందు ను
జ్ఞాని యసాధులన్ గడునసాధ్యుఁడు గావలయున్ నరుం డొగిన్. 396

క॥ ఈయెడ నడ్డము సెప్పకు మోయమ్మ ! యొకింతశ్రమకు నోర్వక చెడుగుల్
దొర్రయనగునె ? కాశికిఁ జని యాయుతపాండితిని రానె ? యట్లిది కాదే ? 397

చ॥ జనకునియాజ్ఞ ముఖ్యముగ నల్పఁగనైనది గాన, వచ్చియుం
డినపను వన్నిరీతుల ననింద్యముగాఁ గనుపించెఁ గానఁ బా

వనము "శుభస్య శీఘ్రి" మనుపద్ధతి గావున వారు వచ్చువెం
టనె తగుచర్య నిశ్చితమొనర్పుఁడు మామయు మీరుఁ జెండిలిన్." 398
క॥ అని తేరినమనమున సుతుఁ డనుమాటల దల్లిదండ్రు లాత్మలఁ గలఁపల్
జన ముప్పూరు సుఖముల గాఁల నిశాశేషంబుఁ బాన్పులన్ నిగుడింపన్. 399

### —♦ ప్రభాతము ♦—

ఉ॥ "కొక్కొరోకో"యటంచుఁ దొలికోడి త్రిభంగిఁ గూసెఁ దూరుపున్
దిక్కున వేఁగుఁజుక్క పొడతెంచెఁ దమంబును బల్చనయ్యె న
ల్దిక్కుల శైత్యపూర్ణములు లేదొలిగాడ్పులు నిల్చివీఁచెఁ గెం
పెక్కె నభంబు డుప్రతతు లెల్ల నదృశ్యత నొందుచుండఁగన్ 400
సీ॥ అరవంబు మాటాడునట్లు పిచ్చిక లన్ని గేహాగ్రకుజములఁ గిచకిచనఁగ
వేత్రిహస్తుఁడు గేకవేయుమాదిరి వాయూరకము లందునందు పజ్జములఁ గూయ
నాయనూపఁదు నూర్యహయముల్ దోలుఁనెక ,నఁ"గాఁకా" యని కాకు లఱవ
పాలమేగు కోడేళ్ళయుఁ లిపినకేతన నిస్వనం బన నెండు నిండి మోగ్రియ
మెయిలు దీపప్రభలభాతి మిగిలిమిగిలి యుంతకంతకు వెలఁగెక్కుడై చెలంగ
నరుణకిరణుండు ప్రేత్రికుఁడీయ మగుమూర్తిఁ బూర్వగిరిఁ దోఁచెమంకెనపువ్వుభాతి
క॥ అలపల్లె వలిపొలంబున సెలయేటన్ బ్రాహ్ణకృతులఁ జెల్లించి సుతుం
డెలమివహించుటకు హృదిన్ దలరినసంతుష్టి పెనుముదంబును గొలుపన్. 402

### —♦ భారవి బాల్యసఖులతో సమాధానము ♦—

క॥ జనకుఁడు గృహముదెసన్ జనఁ దనయుఁడు నద్దెసలఁజూచి తనబాల్యసఖుల్
జనుదెంచుచుండఁ గని గొబ్బున నొకవటు మెక్కి డాఁగి ముచ్చట వెలయన్ 403
క॥ మనసునకు మనసు జీవంబునకును జీవం బొసంగుబూను సుహృదులన్
ఘనగర్వమలినచిత్తంబున నవమానించితిని విమూఢత్వమునన్ 404
ఉ॥ సమ్మతిమీఱ నేమిటఁ బ్రసన్నతఁగాంచి క్షమింతొర్రొ, చూడ నా
స్యమ్ముల సాజదీప్తి నహ, యాదునయా యని వీగిమోళ్ల కే
నెమ్మెయి నేగువాఁడ "నిహిహీ! యిసిసీ!! ముఁ జేరదేల పో
పొమ్ము త్వగర్హభవ్యపదముల్ గఁరోటి" యటు మనవ్వరే? 405
సీ॥ అతిచాకచక్యంబు వారువేర్పడ హుటాహుటిని గాల్వ కరుదెంచురీవి లేదు
భుజ మంటియంటనిపొలుపునఁ దోలుకాడుకావడిచలనంబు గానఁబడదు

చిల్కగోరంకుల చెన్నునఁ గ్రాలు మేలములు నాటలు ప్రసంగములు లేవు
కోయిల ల్గాసరిన ట్లాయాయిబుక్కల యవ్వవైఖరి సుంత నివ్వటిల్లదు
కాళ్ళఁ బెనుబండకొయ్యలు గ్రాలుకరణి నడక గడు మందమై సుడివడుచునుండ
నెత్తులన్ బెద్దబండల నెత్తినట్టు లీదురో! యంచు వచ్చెద రేమి చెప్పుద? 406

క॥ అనిచెట్టుకొమ్మ గుబురుల వెనుక నొదిగి నిలిచి యెటుల వీరు సుముఖులై
నను మన్ననఁ గనుఁగొనఁ గల్గునోయనుచు బాలకవి దిగులుపడుచుండన్. 407

వ॥ తమకుఁ దమబాల్యస్నేహితుండు నిన్న మొన్న నొనర్చినవివిధములైనయవమానముల నొకరితో నొకరు చెప్పికొనుచు నవ్వటవృక్షమూలంబున కేతెంచిన బాలకవి మిత్రులలో నొక్కరుండు చిన్నఁబోయిన మొగంబుతో నిట్లు వచించె. 408

శా॥ ఆబాల్యంబు దశాబ్దము ల్గడచుపర్యంతంబు నీర్పాలు నాఁ
గా బద్ధం బగుమైత్రిఁ దాను మనమున్ గావింపమే? యొక్కరుం
డేఁ బో బెంగవహించి వాని కెదుర ల్నిత్యంబునుం జూడమే?
బాబో! కాశికిఁ బోయిరా నిటుల గర్వం బెచ్చునే యేరికిన్? 409

ఉ॥ తన కొకమేనమామ గడుదత్తుఁడు కాశి వసించుచుంట నా
తనిపెనుప్రాపు సేయుటఁ దా నొకపండితుఁడయ్యె నట్టి వీ
లెనసిన నల్లెకారె యొరు లీతనిగొప్పదనం బదేమొ? కా
దు నిజముగా ఘనుండయిన దుండుకు కీగతిఁ జూపఁజెల్లునే? 410

క॥ బాల్యప్రాణసఖుఁడు నైర్మల్యయశస్స్ఫూర్తి వచ్చెరా యని మైత్రీ
లౌల్యమున నెదురుసనఁగ నకాల్యాతిశయమునఁ జూడకయు పోఁజనునే? 411

వ॥ మఱియొకండు బాబూ! నీవంతవఱకు ధన్యుండవే— 412

చ॥ అమలినమైనప్రేమ గదియుంబడ నేగుననున్ జిరాకుతో
దుమదుమ మంటలేని పెనుధూమము మోమున నల్పుఁగూర్ప నం
తిమకులుఁ జూచి దవ్వగుగు తేకువఁ బాసి తొలంగె నౌర! వీ
నిమిషులుం బోఁబడుల్! మనసు నెరయి యుసురుమంటి నయ్యెడన్. 413

వ॥ అంత మఱియొకండు. 414

క॥ స్వాగతము మిత్రమా! యనఁగా గడుసుంబోక నెదియొగాని వచించెన్
జేగురు దేరిన మొగమున నేగుచుఁ గఠినోక్తి యుక్తమౌమా యెఱుఁగన్ 415

వ॥ [illegible] వైశ్యంపు వెల్లిదనంబానందున గోష్ఠతామ సంపు ముఱికుంజాపుల నరుణిమం బంతనింత వెలికుబికి ప్రబ్బికొనుచుండ నుద్వి గ్నాస్యంబున నెల్లరం గలయం గనుంగొని. 416

మ॥ వినుఁడీ ! మొన్నటివిందువేళ ఘనమౌ వేడ్కన్ మెయిన్ దాఁపకే
యనుమానంబును జూప కంతటిసహాయం బందఱున్ జేయు టీ
తనికిన్ దాస్యపదంబు నొందిరొ ? యథార్థంబెన్న స్నేహంబు చే
తనె కాదే ? కడునీల్గు వీఁడు మనచెంతన్ జేర్పఁగా నర్హుఁడే ? 417

మ॥ తనపాండిత్యమదంబుఁజూప నిఁక లేదా తావు లోకంబులో ?
ననయంబున్ దనపెంపె యాత్మఘనమానంబున్ ముదంబందు మి
త్రనికాయంబులచెంతనా విరసకృత్యంబుల్ జిరాకుల్ బళి !
మన కేమంత మునింగెఁ జెంతఁ గొనరమ్మా యంచుఁ బ్రార్థింపఁగన్. 418

సీ॥ అశ్లేటి నీరు మోయన్ గంది చిట్లిన నాగేశుభుజము మానంగ లేదు
గుండిగ ద్రొల్లించుకొనుచోట సెగబారి కమలె నా కాలు పక్కఁబడలేను
పచ్చడుల్ పిండ్లు రుబ్బన్ బొబ్బలెత్తిన సీనయ్యచేతిగాసి చనలేదు
పిండివంటలవేళఁ బెట్లి చిందిన నేతిపొక్కు లల్లవె కృష్ణుచక్కి చూడుఁ
డపుడు కూరలఁ దఱుఁగుచో నయినకత్తికోఁత లా మధుసూదనుచేతఁ గనుఁడు
దీని కంతకు మనము చెందినదదేమి ముక్కవిఱుపులునున్ మూతిముడుపులె గద !

వ॥ ఇట్లొక్కరొక్కరే తాము పడినభంగపాట్లు దలపోసి వచించుకొనుచుండ మన కథానాయకుం డౌరా ! వీరందఱమనంబులు గడుంగడు నొచ్చి ప్రతీకారం బపేక్షించుచున్నయవి. దుర్బుద్ధినై యిట్టియాపదన్ దెచ్చికొనినవా కిప్పుడు వీరిం బ్రసన్నులం జేసికొన నేదిదారి ? చేసినకష్టమునకుం గలిగినపరాభవంబునకుఁ జివికియున్న వీరిచిత్తంబు లీతలపోఁతలచే నిశితములై యెట్లు పరిణమింపంగలవో గదా ! ఇఁకఁ దక్కినవారుంగూడ జ్వలించునగ్నికి నేతిధారలవలెఁ దమరోసంబుల నీసభకు నివేదింపక యున్న నాప్రయత్నం బొనరింపనిచో వీరియుద్రేకం బుజ్జ్వలితమై యసాధ్యంబు గాకుండునే ? 420

మ॥ పదివేసంబులసామి కృష్ణుఁడు మహాభాగ్యాధికారంబునన్
గుదురై యుండి, యనేకరాజసమితీకోటీరరత్నప్రభా
గ్రదశాపాంగుఁడయ్యుఁ గన్గొనఁడె యంత్యంరన్ గుచేలున్ దయా
స్పదసౌదర్యము మీఱ బ్రీతియొకొ నవ్వాత్మస్పృగ్విశేషత్వముల్. 421

వ॥ అని నిశ్చయించి యొలుంగు మార్చుకొని సౌమ్యస్వనంబున 422

ఉ॥ నిక్కపుఁ బ్రేమ గల్గునెఱనేస్తులు కొంచెపుకారణంబునన్
మక్కువ దక్కి పేర్పుగతి రానుట పెన్పొరపాటుగాదె ! మీ

కెక్క నటింపలేనియొకయింగితహీనుని కోపగించి పోఁ
ద్రొక్కిన నేదిది క్కతనిదోసము లెవ్వరు దిద్దువారలో ? 423

చ॥ చెనటికుమారుఁ దండ్రి నిరసించునె ? యొద్దిక బుజ్జగించి చే
రి నయభయంబులన్ గఱపి పేర్చు ధరింపఁడె ? పట్టిపట్టిన
ట్లైన సెడిజంపు పేర్మి మగునే ? యొకయింతనె ప్రింగి బ్రింగుభా
వనలను బ్రేమరూపు లగవచ్చునె ? తద్గతి నచ్చునే ధరన్ ? 424

క॥ పేర్చుకు నెపముండునె మీ రీమెయిఁ విప్రితలు పొందనేల ? నతండున్
మీమాదిరి నింకరుఁ దనవ్యామోహం బెఱిఁగి చింతనందక యున్నే ? 425

క॥ ఘనపశ్చాత్తాపంబున వినతిన్ వేర్వేఱ శరణువేడిన నతనిన్
గొనకుందురె క్రమ్మఱ మిత్రునిగా మీలోని కెంతదుందుడుకైనన్. 426

వ॥ అను నెడ — 427

క॥ సందియముపాటు మొగములఁ జిందఁగ నందఱు నెవండు చెప్పెడి నిటులం
చుం దెగనిచిత్తములతోడం దరువున కెగయఁజుట్టు దగ్గరుచుండన్. 428

క॥ విప్పారిన మొగమున కొక యొప్పిదుచిఱునగవుతోడ నోహో ! మీరల్
దప్పొకొనుఁ డాగుఁడని తాఁ జప్పున నందొకఁడు ముందు సాఁగి నిలుపుచున్.

క॥ అప్పలుకు లనున దెవరో చెప్పిన నేఁజెప్పినట్లు చేయుదురె యనన్
దప్ప కొనరింతుమన ముద ముప్పొంగఁగ నతఁడు వారి కుత్సాహమున్. 430

చ॥ వినుఁడని పల్కెఁగాఁ దొడఁగె వీఁడెవఁ డన్యుఁడుగాఁ డవగ్రహా
ప్తిని జెడుదారి ద్రొక్కి యది దీఱిననైజగుణంబుతోడ ని
ల్చిన మనచిన్నిదొంగయని చెప్పక చెప్పెడుకంత మెంతమా
ర్చిన సరిపోల్చలేమె నుడిచెల్వగు సవ్వడిఁ జిత్తగింపుఁడీ ? 431

క॥ అనిన నగుమొగము లెగయన్ గనుఁగొనుమిత్రులను జూచి "కడతేరితి వం
దనమిదె హితులారా ! మన్ననఁజూపుఁ"డటంచు ద్రుతమునన్ భువి దుమికెన్.

చ॥ దుమికిన నేను నే ననెడి తొందరఁ గౌఁగిలిఁజేర్ప నందఱున్
గుమికొని చేతులన్ హితుని గ్రుచ్చి యొగాదిగ నూపి పొంగు చి
త్తము దమితీఱ నాడి ప్రముదంబున నొక్కఁడ డింపి "యేమిరా !
మము నెటు విస్మరించితివి మాయొనరించిన చెట్టు లున్నవే ? 433

## —♦ భారతి - విద్యాలయస్థాపనము ♦—

ఉ॥ స్నేహితులంద ఱిట్టుల వచింపఁ గృతార్థుఁడ నాయదృష్ట మీ
యైహికమం దొరల్ గనఁగ నాదుర ! ప్రాణసమానులార ! మీ

మీహితవృత్తి గాక యొకమెచ్చుఁగనైనది యున్నె నాకడన్ ?
దేహము తెల్వితేట భవదీయమొనర్చెద నింక మీఁదటన్. 434

ఉ॥ నిక్కము దాపనేటికి గణించెద మీదరి నొక్కమాట మీ
రెక్కువశ్రద్ధతో వినుఁడి, యెందు సమానులలోనఁ బొందు పె
న్మక్కువ గూర్చు నిందు ననుమానములే దెలజవ్వనంబునన్
జిక్కడిచాన బాలకుని చెంతఁ గళాభ్యుదయంబు నొందునే ? 435

ఉ॥ మిమ్ముల నీసడించు మెఱమెచ్చులగర్వపుమాలు కాదు స
త్యమ్మిది, యెందు నేని సరసంపుఁబ్రసంగము గల్గుచోట మో
దమ్మదు గంగ నూహఁపయిఁ దాఁకెడియూహలఁ గూర్చువక్తల
భ్యమ్మగునేని స్వర్గమది యబ్బినకంటె విశేషమైతగున్. 436

ఉ॥ కావున మీరు నేను దిరుగన్ సయిదోడుల మైనవానికిన్
బావనమైనతత్సుఖ మవశ్యము గల్గుశుభప్రయత్నసం
భావన మేలు నాయెఱుకపట్టున నున్న సమస్తవిద్యలున్
మీవశము ల్పొనర్చెదను మీకును నాకును మోద ముబ్బఁగన్. 437

చ॥ గురువును శిష్యుఁడంచు నొకగొప్పయుఁ గొంచెముఁ బెట్టుకొక యే
బెరుకును సోకనీక కడుస్వేచ్ఛగ మీయనుమానముల్ దివా
కరకరదీప్తిముందు హిమకాండమటుల్ విడిపోవ నేటిని
బ్బర మగుపూన్కి నేఁడుగ శుభంకరశాస్త్రము లభ్యసింపుఁడీ. 438

ఉ॥ వచ్చినకొంచెమైనఁ జదువన్ దరిఁజేరెడువాని కాస్థతో
నిచ్చుట పెంపు, సోమరిగ నేర్పడి " నాతల కెక్క దెద్దియున్
ముచ్చయి పోటిపోక కడుపూన్కి మెయిన్ జదువంగ బాగు, మీ
కచ్చ బిగించి శాస్త్రపరిఖల్ వడిదాఁటు నుపక్రమింపుఁడీ. 439

క॥ దానికి భుజము లెగుర సఖు లానందముతోడ వల్లెయని యవధానం
బూన నవీనకవీంద్రుఁ డనూనాధ్యాపకకళావినోదమహితుఁడై. 440

క॥ తెలుపుఁడు మీజనకులకును సలుపుఁడు ప్రాజ్ఞావిధులెల్ల సత్వరముగ రా
దలఁపుఁడు ప్రతిదిన మస్మన్నిలయమునకు నంద ఱొక్కనియతి చెలంగన్. 441

క॥ ఏమనిచెప్పుదుఁ గాశీసీమన్ వెలుగొందుసూరిశేఖరులఁ గళా
స్తోమావధానవిలసద్ధీమాహాత్మ్యంబు దెలుప దేవునివశమే ? 442

మ॥ వరసారస్వతులున్ జతుర్ముఖులు సర్వజ్ఞుల్ పరీక్షింపఁ బ
ల్వురు షట్కర్మవిధానదక్షు లురుశీలు ర్వారణాశీపురీ

పరభాగ్యోదయభాగధేయు లగువిప్రశ్రేష్ఠు లందెన్న నే
పురుషుండుం దుది నొక్కశాస్త్రమునకేన్ జూచీపడన్ జాలెడున్. 443

ఉ॥ విశ్రుత గల్గుపండితులు తద్దయు నచ్చటనే వసించుటన్
శిక్ష వరించుశిష్యు లటఁ జేరుట తేలుట నిల్చుటయ్యె, న
ట్లేక్షితినైనఁ గాఁదగదె యిందఱు మీరు చలింపఁబోని మే
ద్రేక్షువహింపఁ దత్ప్రతిభ దేలదె యీచిఱుపల్లెయేనియున్. 444

క॥ చనుఁ డీఁక మీమీపనులకు మనమున నేమఱకుఁ డిచటిమాటల మీమీ
జనకులసమ్మతిఁ గొని పడిఁ జనుదెం డిదె నేను నేఁగి చక్కనగుదనన్. 445

క॥ వారలు మఱి మఱి యాతనిఁ జేరి తమి బహూకరించి "చిటుకలపై నీ
మేర కరుదెంతు" మనిచన నారభటిన్ దాను నిఁటి కరిగి ముదమునన్. 446

శా॥ 'నాన్నా ! విన్నప మున్న దొక్కటి సఖుల్ నాదుర్జనత్వంబుచేఁ
జిన్నంబోయి ప్రతిన్ బొనర్చుటకు సంసిద్ధంబుగా నెంచుచుం
డ న్నే నావటవృక్ష మెక్కి విని యన్నా ! గర్వి కెందైన నా
పన్నత్వంబె ఫలంబటం చెఱిఁగి ప్రాప్తంబైన విజ్ఞానతన్ 447

ఉ॥ మంచిగ వారిఁ దేర్చి క్షమాపణ దెల్పి ప్రసన్నవృత్తి నొం
డించి బహూకరించి కడుదీక్షితులం బొనరించినాఁడ నా
మించినవిద్య వా రధిగమించువిధానమునందు మీరు నా
కొంచెపుసేఁత కుత్సుకత గొల్పినఁ బూనెదఁ దత్క్రియాగతిన్. 448

చ॥ అనిసుతుఁ డాడుమాటల కనంతముదంబునఁ బొంగి లేచి యా
తని బిగిగౌఁగిలించి యొదఁదాల్చి శిరంబున ముద్దులాడి 'తం
డ్రి ! నవకృతాచ్ఛవజ్రము మరీచివితానములన్ సమస్తలో
కనయనమోద మీయదె కనత్కనకాగ్రనిబద్ధసద్గతిన్. 449

ఉ॥ నిండుసుధాకరుండు సుధ నింపఁడె యన్నిట భానుమూర్తి పే
రెండలఁ గాయఁడే జగతి, నేడ్తెర నంబుదముల్ రసంబులన్
బిండవె ధాత్రిఁ బాండితిని బేర్చినసజ్జనుఁ డట్లె విద్య నీ
కుండఁగలాఁడె మెచ్చితి గుణోదధి నీపరమార్థబుద్ధికిన్. 450

మ॥ మహితోదారుఁడ వీవు వ్యాపన రహింపన్ విద్యకున్ సాజ మి
మ్మహనీయద్వయసంగతిన్ గనరె సమ్యక్ప్రజ్ఞ శిష్యుల్ తదీ
యహితారంభముకంటె సంతసమునీయన్ మాకు వేఱున్నదే
గృహిణీ ! యెక్కడ ? క్రొత్తవార్త యిటురావే ! నీకు సంతోషమా. 451

శా॥ వింటే! బాలుఁడు వానిమిత్త్రతతులన్ విద్యాగురుత్వంబు పై
కొంటం దెల్పెడు నేఁటినుండియును జాగు ల్మాని శిక్షంబు నీ
వంటన్ దొందరఁగా ముగించఁదగు సాపాటైననే గాని యా
వెంటన్ వానికిఁ బోవఁ దీరదుసుమా! విద్యామహావాటికిన్. 452

క॥ తనయుఁడు సావడినుండఁగ జనకుఁడు వంటగది కేగి చాన కొవరుఁ డీ
యనువున నైన నిశన్ నడచినది మఱపుఁ జెందునట్లు చేయఁగవలయున్ 453

ఉ॥ తల్లివి వానిబుద్ధి తగుదారుల నెట్టిలనేని ద్రిప్పి మే
లుల్ల సిలంగ నెట్టిసరినూనెదొ నేర్పఁటి వీవు నీకు నా
యల్లిక నేను జెప్పవలెనా?' యని భార్యచెవిన్ దుర్తంబుగా
నల్లన నూఁది శ్రీచ్ఛత రయంబున సావడి కేగుదెంచుచున్. 454

క॥ వెలికూటం బధ్యయనస్థలముగ యోగ్యపఁగునంచుఁ దలఁచెద నందున్
గలవస్తువితతులన్ లోపలికిన్ బట్టించి వీలుపఱతము రమ్మా. 455

మ॥ అనుచున్ బుత్త్రుఁడు దాను సేవకులతో నందేగి సర్దించి బూ
జును మాలిన్యము జొప్పి, గోడలపయిన్ సున్నంబుఁగొట్టించి నే
లను శుభ్రింబుగఁ గోమయంబునను మేల్గాంచి యూడ్పించి ము
గ్గును దీర్పించి యలంకరించి పటముల్ కుడ్యంబులన్ వ్రేలఁగన్. 456

క॥ తగిలిచి దర్భాసనములఁ దగఁ జుట్టును బఱచి యున్నతములుగ నడుమన్
దిగపీఁటలేసి తదుపరి మృగచర్మము లునిచి తీర్చి మిగిలెడువేడ్కన్. 457

వ॥ మఱునాఁటి యుదయమునఁ గళార్థులందఱు రాఁగా శ్రీపండితుం డగ్రాసనం బధి
ష్ఠించియుండ రెండవదానిపై నూతనపండితుం డుపవిష్టుండై. 458

మహాస్రగ్ధర॥ సకలశ్రేయోవిధాతా! సరసనిగమవిస్తారపర్యాప్తచేతో
వికసద్బ్రహ్మాండజాతా! వివిధపరివదుర్వీజవిజ్ఞానశాఖా
దికవృద్ధిస్థానభూతా! ధిషణకషణసందీప్తమానాత్మవిద్యా
ప్రకటోద్యానాగపుష్పప్రచయసురభిసంపద్వసంతాయమానా! 459

క॥ సకలకళాభ్యుదయా! నిర్వికలాఖిలసత్ప్రియత్నవిజయానందై
కకరా! పారకగురువాక్ప్రకటీకరణానుకూలకళ్యాణ! హరీ! 460

వ॥ అని పరమాత్మ నభినుతించి. 461

శా॥ సర్వజ్ఞుం డగుశంకరున్, నిగమనిశ్వాసున్ శతానందు, వా
క్పూర్వప్రాభవ నాసరస్వతిని, విఘ్నధ్వంసు హేరంబునిన్

దుర్వారప్రతిభున్ హాయాసను, సమర్థున్ వ్యాసు, వల్మీకజున్
గీర్వాణీబుధుఁ బాణినిన్ బరమభక్తిశ్రద్ధఁ గీర్తించెదన్. 462

చ॥ కపిలుఁ బతంజలిన్ దివిజగణ్యుల సద్గురుమూర్తులన్ గళా
ధిపులఁ, గళాప్రపోషకులఁ సర్వకళాభ్యసనాశ్రమాళులన్
విపులకళాప్రదానబహువిశ్రుతకీర్తులఁ, దత్కళాంగజా
వపురనుబద్ధసన్నిపుల బంధురభక్తి సతంబుఁ గొల్చెదన్. 463

వ॥ అని విద్యావిషయకసమస్తశక్తుల కంజలి నొసంగి 464

క॥ అస్మదవతారకారణు విస్మయకరవేదభారవిన్ బ్రోత్సాహా
త్మున్ స్మేరదయారసభరసస్మితవదనాబ్జకలితు జనకు నుతింతున్. 465

క॥ మాతులు మద్యోగక్షేమాతన్వత్ప్రేమభరితు నఖిలకళాభి
ద్యోతకదేశికశేఖరు ఖ్యాతమహాపండితప్రకాండు భజింతున్. 466

మ॥ రవి కర్ఘ్యం బిడి, పోఁగుఁ జంద్రునకుఁ జేరన్ వైచి, దేవేజ్యు భా
ర్గవుఁ గీర్తించి, బుధున్ స్మరించుకొని, సూర్యప్రోద్భవున్ రాహుకే
తువులన్, భూసుతు మంచి చేసికొని దీప్తప్రేమ నీసంస్థ కు
త్సవవృద్ధిప్రదమూర్తులై వెలయు నాత్మన్ మ్రొక్కి సేవించెదన్. 467

వ॥ అని ప్రార్థనాదికంబు ముగించి 468

చ॥ సచివవరేణ్యులార! కరసంపుటి హృత్పుటిసోకఁ బట్టి, సం
కుచితముగాఁగ మస్తకము కొంచెము వంచి, యనన్యయోజనా
ప్రచయము మాని, దృష్టి నిలఁబట్టి త్రికాలమునందుఁ గట్టి కా
ర్యచతుర కాచతుర్వదనురాణికి వాణికి జోతఁ దెల్పుఁడీ. 469

సీ॥ చమురుమురికి సోకి స్వచ్ఛంబు గాకుండు పలకపై లిపి కనంబడదుగాదె?
గిజ్జునఁ దిరుగు కాగితముపై వ్రాలించుటైన వ్రాయఁగ నశక్యంబుగాదె?
నీరంబులోన మునింగినపలకపై వ్రాఁత సుంతయు నిల్వఁబడదుగాదె?
గట్టితే కింతలోఁ జెఱఁగునై పుచెక్కపై లిఖితంబ శాశ్వతముగాదె?
గ్రహణమున నైన పసఁగి ధారణను సుకున్ లుకుపలె మానసంబుల తేకువలగ,
ముసరుచింతలు చలనముల్ సోఁకకొలఁది ధ్యానవిద్య విధించి రధ్యయనవిధులు.

క॥ తేటినమనమును గుతుకము మీఱినశ్రద్ధయు ససంభ్రమితమనసంబున్
వారనిమిత్రము లధ్యయనారంభమున కందుఁ బ్రజ్ఞ నందఁదలఁచినన్. 471

ఉ॥ ఊఁకొనుమాత్రఁ గాక తనయోజనకున్ బనియిచ్చి శంకలన్
గైకొని యక్షరాక్షరముగాఁ బెనుజాపిడిఁ జర్చసేయ గా
ఢాకృతి నొంది యట్టివిషయం బిఁక బుద్ధిని వీడిపోదు ప్ర
త్యేకము "వల్లె"వేయుపని యింతయు నుండదు నేర్చు వానికిన్. 472

క॥ తనయుఁడు చదువఁగ నేగడు నని వాఁడొనరింపఁదగిన పన్నియుఁ దలపైఁ
గొని కష్ట మొందుజననీజనకులకృషి నలఁకుఁ డెట్లు సార్థకపఱచున్ 473

క॥ ఇటుఁ జదువులోనఁ దేలం డట సంసారమున మెలపు నందఁడు రెంటన్
దిటవు గనలేక తుది నటునటుపడి దుఃఖమున మునుఁగు మందుం డెందున్. 474

ఉ॥ కావున, మిత్త్రులార! కుతుకంబులకూరత నేఁటి రేపటన్
జావఁగనీక పెన్బఱుగు, చప్పున జాఱుట లేనివిబ్బరం
బై విలసిల్లుశ్రద్ధ వెలయున్ జదువన్ వలయున్ సమస్తశా
ఖ్యావహపాండితీశుభపదాగ్రతలం బచిరంబుఁ గాఁ గనన్. 475

వ॥ అని యిప్పాటఁ బఠనక్రమంబు నుద్ఘాటించి దినదినాధ్యయనవివరణంబు నిర్ణయించి శ్రద్ధాళువులై శిష్యులు క్రమంబున గడిదేఱుచుండ పాఠశాల కొనసాగుచుండె. అంతం గొన్నినాళ్ళకు. 476

## —◆ భారవి - వివాహము ◆—

క॥ మును సుతకై మనువునకై చనుదెంచినబ్రాహ్మణుండు సరవి మరల వ
చ్చినఁ దగిన పెద్ద లందఱు ననుకూలం బనఁగ గృహి తథాస్తని తెలుపన్. 477

క॥ ఉభయకటకములవారును శుభగాయకవైణికాదిశోభనములతో
విభవంబుపేర్మి సలిపిరి ప్రభుపండితజనవినోదభరముగఁ బెండ్లిన్. 478

వ॥ ఆవైవాహికమంగళాచరణసమాపాది శోభనకళాన్వితు లగు నానూతనమిథునమందు వరుండు. 479

చ॥ కళలను బూర్ణుఁడై యెటులుగాఁ బరసూగుల నాక్రమించెనో
కళలను బూర్ణుఁడై యటుల కింతుజయంతముఖాతిసుందరాం
గుల నిరసించి మించె నతికోమలభామసమానవిక్రమవి
స్ఫురిత వెదచల్లుచేన నదియూఁగు స్ఫురదుగ్రచిరాంగసంగతిన్. 480

ఉ॥ చప్పునఁ జూచినన్ నిలిచి చక్కఁగఁ జూడకపోవఁగా డసు
మెప్పుడుఁ జూచుచున్నఁ దనివింతయుఁ దీఱనియట్లై యుండు, నా

యొప్పను గాంచు వా రితరయోజన లన్నియు విస్మరింతు రైఁ
గప్పినసంతసంబు కడఁగండ్ల ముదశ్రుకణంబు లూన్పఁగన్. 481

వ॥ తదనురూపవతి యగు వధువు 482

క॥ బింబంబు పెదవి, నీరజబింబంబు గళంబు, ముఖము విధుపూర్ణకళా
బింబంబు, సురవధూప్రతిబింబం బగుఁ దనువు రూపవిభవము పేర్మిన్. 483

క॥ ఆ నేవళంబు గన్నుల నానిండగు తేట నుడుల నామాధుర్యం
బా నొసలిటివిన్నాణము నానాశృంగారగుణగణప్రథితంబుల్. 484

సీ॥ జాజిమొగ్గలచాలు తేజుమించినడాలు కుదురుసౌరునఁ దేలు రదనమాల
సంజ బంగరుచాయ చవితిచందురుచాయ నెమరునిగ్గులు గాయు నుదురుహోయి
పసిడివన్నెలఁ గ్రుక్కి మిసిమియద్దము నిక్కి చిలుకుఁజక్కనఁ జొక్కి చెక్కిళులును
కోదమ తేటులబాఱు గుప్పిచ్చినట్టుల జాఱు నిగనిగన్నిగ మీఱు నెఱికురులును
గవ్వకడుపుపగు ల్వ్రిక్కఁ గ్రొలుగీట్ల యమరికన్నవ్వు కను టెప్పలందు వెలయు
చిఱుకురులవంపువరుసయుఁ జెలఁగఁ దనరు సుద్ది మనుజుల నరిదియన్ సుద్దిదెల్ప

ఉ॥ కిన్నెర మీటుసొంపు నొలికించెడి గాత్రనినాద మిద్ధహా
బన్నసరంబునా వెడలుభావనుగర్భితవాక్ప్రపంచ ము
ద్యన్నవనీతతుల్యమృదుతన్ బ్రతిభాషిత మూను నేర్పుసం
పన్నత లావమూషణి స్వభావభవంబులుగాఁగఁ దోఁచెడిన్. 486

సీ॥ భావిపూర్ణామోదబాహుళ్యశంకాసముత్పాది యగుపూవుమొగ్గ యనఁగ
సత్సుధానిష్యందసంపూర్ణపూర్ణిమాకంబునూచకకళాఖండ మనఁగ
పటుభవిష్యత్పక్వఫలరసప్రకటీకరణధుర్య మగుపిందె రా యనంగ
బహుపుష్పఫలకదంబకవృత్తిపరిణామమూలమై తగుచిన్ని మొలక యనఁగ
సుప్రసాదంబు గాంతి వాక్శుద్ధి దేహవల్లరీచారుగరిమంబు బహుళరుచుల
ముందు రాఁబోవువింతలక్రిందు తెలుప సౌరులన్ మీఱె వధువు బంగారుబొమ్మ.

వ॥ అప్పు డావధూవరులమధ్యమున — 488

క॥ తెరచాటు తొలఁగినను వా తెఱచాటు తొలంగదేల తెక తెకకన్నుం
దెఱపఁ బ్రవహించురాగము తెఱఁ గనులాపములకలిమి తెఱగుపడంగన్. 489

క॥ పటుములు ముడివడు వెంటనె కుటిలతరాపాంగనటన కూడి మెలివడెన్
పటుదీర్ఘవామకరసంపుటి వధువున్ బొదువఁ బ్రేమపొంగులు కలిసెన్. 490

క॥ వధువు ప్రేమాంకమై యేటవాలుగాఁగ నుపరి జందెంబు వరునిపై యొలసి వెలయ
వరునియనురాగచిహ్నమై వధువుమెడను మహితమంగళసూత్రంబు మాఱువెలిఁగె.

56

ఆ॥ పుడమి యంతయు ఱుంగు నుదువీథి యంతపందిరియు నాఁగ మిగులఁదేజు మీఱ
నాయతంబు లైన యంగణంబులఁ బెండ్లిశాలలందు సొగసు చౌకళించె. 492

ఆ॥ ఆరగింపుపంక్తి యనమోహినీదేవి పంచిపెట్టునాఁటిపంక్తి పంక్తి
మరల నేఁటిపెండ్లిఁ బరగుపంక్తియె పంక్తి యధికమిఁక యనాస్తినాస్తి యనుట.

క॥ దేవతలు మెచ్చునట్లుగ నీవరుసన్ బెండ్లి జరుగ నెవరియెడను వా
రా వెనుక నరిగి తమయగ్రావసరములందు ముదము నందుచు నుండన్. 494

చ॥ "అది యొకతేనెపట్టొ? యపు డాడి వెలార్చిన వెన్నముద్దయో?
యొదవినచంద్రకాంతశిలయో? పులకండమొకో? పటీరమో?
హృదయము తండ్రిగారిది? యహీనదయాపరమూర్తి మాటఁగా
దె దుడుకు సైచి శిక్షగ విధించిరి శ్వశురగృహప్రవాసమున్. 495

ఉ॥ అట్టి కృపారసార్ద్రజలశాయితుఁడౌ జనకుండు ప్రేమపెం
పుట్టిపడంగఁ గౌఁగిలి మహోత్సుకతన్ నను గ్రుచ్చి "బిడ్డఁడా!
దొట్టిన దుర్గ్రహాచరణఁ దోఁచినదానికి నీవు కర్తవే?
నెట్టుము వట్టిచింత" యనునిందు నుదారత లింతయొప్పునే! 496

మ॥ తను జంపన్ బనిఁబూని వచ్చినయసద్దైత్యున్ కృతాంతోగ్రప
త్తనసంవాసిగ రాజశాసనము నిర్దాక్షిణ్యతన్ బంప కో
ర్చి నయోక్తుల్ సెలవిచ్చి సౌఖ్యపదమున్ శిక్షాకృతింజేసి చూ
పునె! సాధుత్వము ముందు తామసవిధంబుల్ సద్గతిం జెందవే!. 497

శా॥ ఔరా! శిక్షయె! యత్తవారిగృహమం దల్లుండు నిల్వంగ! నె
వ్వారున్ విన్న హసింపరే? ప్రణయదీవ్యద్రాజ్య, మేకాధికా
రోరుప్రాభవపథంబు, గోర్కులకుఁ గల్పోర్వీరుహప్రాప్తి, పె
ల్లారాటంబున నట్లు తల్లియు నదైర్యం బొంద నేహేతువో? 498

సీ॥ ఆదర భయముల నడఁగి పెనంగెడి యత్తమర్యాదయే యగునొ శిక్ష!
గౌరవంబు ముదంబు గడఁకయుఁగలమామగారి గౌరవమె శిక్షావిధంబొ?
స్నేహంబు నడఁకువ నిండారుభావము లందుల మన్నించు క్రియమె శిక్ష?
సొగ సనురాగంబుఁ జూపించుభార్యభక్తి శ్రద్ధలే శిక్షతీర్పుబడులా?
కన్నుసన్నల సేవఁ జక్కఁగనొనర్చు దాసదాసీజనుల యోర్పె? దండశిక్ష!
అమలచిరగురుసౌఖ్యంబునందు నన్నుఁదెగువ జనకుండు నిలుపు మన్నగడ గాని.

సీ॥ తెలియమే వారివితీర్ణి తెంపు నుదారతానూర్తిఁ గళ్యాణదర్శనమున
నెఱుఁగమే వారిసాహిత్యసాహిత్యవిస్తారంబు క్రిందటి శ్రావణమునఁ

గాంచమే వారిసంకల్పసిద్ధియు నౌచితీవ్యాప్తి వర్తంబు దీర్చునపుడు
పరికింపమే వారిపరసుసౌహార్దంబు సంక్రాంతిపంబుగ సమయమునందు
చూడమే వారియఱమఱఁ జూడఁబోనికల్పకోలు దీపావళి కాలమునను
నహహా! యింతసమగ్రసౌఖ్యంపుబాట యైనశ్వశురగృహంబు శిక్షాక్షమానె.
క॥ అని చిత్తాకాశంబున ఘనవాయువిమానమధ్యగతుఁడై యూహా
వనజాకరపీయూషంబున భారవి మేను మఱచిపోవుచునుండెన్. 501
సీ॥ బాలుఁ డెట్టు లెఱుంగు గుండేలుదెబ్బ? తీయనపుఁ జొక్క ముగ్గదే తేనెనీగ?
మొఱపోయి సకలంబు గాంచనమే ధరిత్రి? నసువపక్షుల వినరివా రార్తిఁబడరె.
గీ॥ పట్టు వ్రట్టైద వేటికి వలవ దుడుగు మనుచు జనకుండు మన్ననఁ జనవుఁ జూప
గంటితడితోడ జనని దీర్ఘముగ వేడ మఱుర నైజం బకటఁ బూన్కి మానఁ డతఁడు.
శా॥ నాన్నా! మన్ననచూడ్కి నాపయిని మీనైజంబు; మత్కృత్యముల్
మన్నింపందగు నేఁడు లోకపతి యిమ్మాడ్కిన్ ననున్ వీడునే?
పున్నెంబో యసదో పలం బనుభవింపుం డంచు శాసింపఁడే?
యన్నిష్ఠతము నీగికోవలదె? ప్రాయశ్చిత్తదీక్షావిధిన్. 504
మ॥ కనులన్ గిఱ్ఱునునీటితో ముఖకళాకాంతిచ్ఛటల్ డిందనో
జననీ! దుఃఖము నొందకమ్మ! కడుప్రాజ్ఞత్వంబుకల్మిన్ ననున్
మనునిన్ జేసిన మీకు లేతపని యిక్కార్యంబు, పోగల్చి ర
మ్మని దీవించి ననున్ ద్వరన్ బనుపుఁడమ్మా! పోయి వేవచ్చెదన్. 505
చ॥ అని సాష్టాంగముగాఁగ వ్రాలుసుతు భార్యాభర్త లీక్షించి ప
ట్టినపట్టీగని వాని మానసము రూఢిన్ జిన్ననాఁడే యెఱిం
గినవా రౌటఁ "దథా"స్తటంచు విజయోక్తిన్ నించి దీవించి పొం
గునఁ జిత్తంబుల నిండువంత కడుగగ్గోల్గూర్పఁగా నార్తులై. 506
వ॥ అందు జనకుండు. 507
ఉ॥ పావక! నిత్యమున్ నియతిభంగముగాని పవిత్రభక్తిసం
భావన వేదబుఙ్నిచయపావనఘోషఁ ద్వదీయపాదసం
సేవనఁ జేతునేని గృప చిందఁగ నీతని నీప్రవాసకా
లావసరంబులందున ననామయతన్ బరికింప వేఁడెదన్. 508
వ॥ తదుపరి తజ్జనని 509
శా॥ అంబా! నీకరుణావిశేషమున విద్యాపూర్ణుఁడై యెందు లో
పంబు లోనికనిక్షేమవర్తనమునన్ బాలుండు పెంపొందె ను

గ్రింబై కన్పడునీపరీక్ష విజయారంభంబు గాఁడేల పా
యంబై క్రిమ్మర నాకొసంగవె శరణ్యం బీవె నా కంబికా! 510

సీ॥ పరికింపరయ్య! దిక్పాలురారా! త్వదీయ భక్తు నీతని ప్రాపాభరము నించి
కాంచి సైదోడులై పంచభూతములార! మించు ప్రేమమునఁ బోషించుకొనరె
వనపట్టణారామవారిదేవతలార! మీ సుతుండగు వీని మేలుఁగనరె
యిచ్ఛాక్రియాజ్ఞానసచ్ఛక్తులార! మంత్రప్రభుత్వోత్సాహా గ్ధ్య మిడరె
అశ్వినీదేవవైద్యులారా! నిరామయత్వసౌఖ్యం బొసఁగి వీని నరసికొనరె
కడుపు గడ్డంబు నొవ్వను బడవి మ్రొక్కెదానఁ బరమాత్మ! వీని సాదరతఁ గనుమ.

చ॥ అని యిరుసేతులన్ దనయు నాస్యము చుట్టు నివాళి త్రిప్పి నె
ట్టనఁ దనచెక్కులన్ మెటికె "టప్ట" పనన్ విరియించి యక్కునన్
గొని బిగికౌఁగిలిన్ బొదివి ఘోరము సోకనిరత్న మెన్నియే
నొనరిచి ప్రేమ వొంగి మఱియున్ దనివోక టులే యొనర్చుచున్. 512

ఉ॥ ఓ ననుగన్న తండ్రి! సుగుణోదధి! యెన్నఁడు నిన్నుఁ గ్రమ్మరన్
గాంచెద నాను? వెన్నెలఁ గాయు భవద్రుచిరాస్యదీప్తికిన్
దేనికి లోకనీయముల తీయనకున్ ... మా
కే నజ రిచ్చు నిన్ వదలి యెట్లు భరింతువెం బెంగ పొంగులన్? 513

క॥ అనుసతిపరిదేవనమున్ విని యిట్లను భర్త కాంత! వీని వదలి యిం
టను యుండ నేమితోఁచును? చనవలయుం గాక యాత్ర సలుపుకొనంగన్?

గీ॥ ఎంత లేదన్న వ్రతసిద్ధి కేఁడు గాఁదె? వనిత! యీలోన నునయాత్రయును ముగియదె
కొమరు సౌఖ్యపునస్నమాగమనమునకు సకలతీర్థాభిగమనంబు చాలకున్నె 515

క॥ అని నిర్ణయించి పియ్యంకునతను నవ్వార్త కమ్మగూర్చి యనిపి మే
ల్దినమున సమస్తబంధులయనుజ్ఞ సతితోడ నాతఁ డరిగెన్ లలితోన్ 516

శా॥ కాశీపండితుఁ డంతకున్ మును పె స్వగ్రామంబు జేరెన్ యదృ
చ్ఛాశక్తిన్ నడిపించె భారవి గృహస్వాస్థ్యంబులన్ బారశా
లాశారద్యకళావిధానము సఖుల్యాబాసనన్ గ్రామమం
దీశోభన్ జనులెల్ల మెచ్చుటల నెంతే మెచ్చి యగ్గింపఁగన్. 517

ప్రథమభాగము – సమాప్తము.

---

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.